# గగన తరంగిణి

## రేడియో ప్రసంగాలు



జెల్లా మార్కండేయ

ప్రసన్న ప్రచురణలు

4-10-32/బి2, శ్రీరాంనగర్

నల్లగొండ-508001

# GAGANA THARANGINI
(Radio Talk)

**First Edition:** Nov 2000

**Copies:** 2500

Tiltle: **P. Sudharshan**

Colour Photo: **P. Dasharadha Kumar**

Price: **Rs. 85/-**

For Copies
4-10-32/B2, Sri Ram Nagar,
Nalgonda - 508 001

Composed at:
**Om Teja Graphics**
H.No.3-13-1/4B,Srinivasapuram,
Ramanthapur,Hyd-13
Phone 7035196.

Printed at
**Saraswathi Offset Printers**
Nallakunta, Hyd. Ph: 7612180

Cover Printing at:
**Kalajyothi Process**

# అంకితం



తెలుగుదేశం నిర్మాత బహుముఖ ప్రజ్ఞాశాలి,

తెలుగు తేజాన్ని ప్రపంచ మంతటా వెదజల్లిన

ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రివర్యులు

క్వీ. శే. డా. నందమూరి తారక రామారావుగారికి

భక్తితో.....




**CHIEF MINISTER**

**ANDHRA PRADESH**



శ్రీ నారా చంద్రబాబునాయుడు

# సందేశం

గాంధేయ వాదం, ప్రజాస్వామ్య మౌలిక ప్రమాణాలు మొదలుకొని 'జన్మభూమి' మౌలిక విలువల వరకు వివిధాంశాలను గురించి గత పాతికేళ్లుగా జొల్లా మార్కండేయగారు ఆకాశవాణి ద్వారా చేసిన కొన్ని ప్రసంగాలను క్రోడీకరించి "గగనతరంగిణి" పేరుతో ఒక సంకలనాన్ని వెలువరించడం ఎంతైనా ముదావహం.

సమజా వికాసానికి, వ్యక్తిత్వ పరిణతికి ఉపకరించే సాహిత్యం విభిన్న ప్రక్రియల్లో పాఠకులకు అందుబాటులోకి రావలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. సామాజిక జనజీవన విధానాన్ని ప్రభావితం చేసే ముఖ్యాంశాల్ని విశ్లేషణతో అధ్యయనం చేసి సార్వజనీనమైన పునాది విలువలను వెలుగులోకి తెచ్చేందుకు ప్రసంగవ్యాసాలు బహుదా దోహద పడతాయి.

విద్యార్థినీ విద్యార్థులు, యువజనులు, వివిధ రంగాలకు చెందిన వ్యక్తులు యీ ప్రసంగాల సారాంశాన్ని మననం చేసుకుని స్ఫూర్తిని పొందగలరని ఆశిస్తున్నాను.

(నారా చంద్రబాబు నాయుడు)

**KADIYAM SRIHARI,** *M.Sc.,*
MINISTER FOR SCHOOL EDUCATION,
PUBLIC LIBRARIES, ADULT EDUCATION,
ARCHAEOLOGY & MUSEUMS



*Phones* 3454961 (O)
3459633
3313220 (R)
3303316

HYDERABAD

*Date* ..............

కడియం శ్రీహరి

గగన తరంగిణి, శ్రీ జెల్లా మార్కండేయగారి రేడియో ప్రసంగములు. మహాపురుషుడు బాపూజీ, లోకమాన్యుడు అహింస, చిత్తశుద్ధి యిత్యాది విభిన్న విషయములపై కావింపబడిన రచనలు మిక్కిలి విజ్ఞాన దాయకములై, పరిపూర్ణమై, అర్థవంతమై, సరళమైన భాషలో సామాన్యులకు కూడా ఎంతో విషయ పరిజ్ఞానము కలిగిస్తున్నాయి. చదివిన కొలది చదవాలనిపించే ఈ రచనలు బహుళ ప్రయోజనము చేకూర్చగలవని ఆశిస్తూ, రచయితకు నా శుభాభినందనలు తెలియజేస్తున్నాను.

కడియం శ్రీహరి

( **కడియం శ్రీహరి** )

Grams : "TELVERS"

Phone . 040-3234815
040-3236911
Res : 040-7037585
Fax : 040-3236045
Email : psluvc@ap.nic.in

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY

Prof. N. Gopi
M.A., Ph.D.
VICE - CHANCELLOR



Lalitha Kala Kshetram
Public Gardens, Nampally,
Hyderabad - 500 004 (A.P.)

28.10.2000.

# ప్రసరించిన 'మార్కండేయ' వాణి

ఎన్. గోపి

శ్రీ జెల్లా మార్కండేయులు సామాజిక, తాత్విక, ఆధ్యాత్మిక దృష్టి అభ్యుదయ భావాలు కలిగిన రచయిత. వీరు ఏ విషయాన్ని చెప్పినా ఆత్మీయంగా చెప్తారు. వీరిమాట, రచన సరళంగా సూటిగా వుంటాయి. మహానుభావుల్ని స్మరించినా, మట్టి గొప్పదనాన్ని విప్పినా, అంతరాత్మను ఆవిష్కరించినా పాఠకుడి అవగాహనకు దగ్గరగా వివరించడం చూడవచ్చు.

'గగనతరంగిణి' పేరుతో వీరు ప్రచురిస్తున్న ఈ గ్రంథంలోని 25 వ్యాసాలు 1975-2000 మధ్యకాలంలో రేడియోలో ప్రసంగించిన అంశాలు. జనరంజకమైన శీర్షికలతో, జనావళి అందరూ తెలుసుకోవలసిన విధంగా రచయిత పాఠకులకు అందిస్తున్నారు.

'అరుదైవ మహాపురుషుడు బాపూజీ' వ్యాసంలో ప్రాచీన యుగపురుషులలో చివరివారుగానూ, భవిష్యత్ యుగపురుషులలో ప్రథమగణ్యులుగానూ గాంధీగారు అవతరించారు. భవిష్యత్తులో పరమాత్ముడు అవతరింపజేసే మహాపురుషుల బీజాలు కూడా గాంధీజీలో కన్పించాయి అంటూ పరమపురుషుల ఔన్నత్యాన్ని వివరించారు. గాంధీజీ పిల్లలకు పిల్లవాడిలా, స్త్రీలకు సోదరుడిలా కన్పిస్తారు. గాంధీగారి దృష్టిలో ప్రజాస్వామ్యాన్ని వివరించారు రచయిత. ప్రభుత్వ దురాగతాలు, ప్రజాస్పందన, అహింస, విజ్ఞానం, క్రమశిక్షణ, పక్షపాతదృష్టి, మూఢనమ్మకాలు మొదలైన అంశాలు ప్రజాస్వామ్యాన్ని ఎలా ప్రభావితం చేస్తాయో తెలియజేశారు.

'స్వాతంత్ర్యం' వ్యాసంలో భరతమాత కన్న స్వాతంత్రపు కలను నిజం

చెయ్యడానికి మహానుభావుల జీవితాన్ని ఎట్లా సమిధల్లా దహించుకున్నదీ కళ్ళకు కట్టించారు. గాంధీగారు తన డైరీలో రాసుకున్న వాక్యాన్ని ఉటంకిస్తూ - "ఈ అంధకారాన్ని చూసే దురదృష్టం కలగకుండా భగవంతుడు నా జీవితాన్ని తీసుకుపోవాలని ప్రార్థిస్తున్నాను" అంటారు. ఇలా వాళ్ళను వాళ్ళు బలిపెట్టుకోవడానికి సిద్ధపడ్డ వాళ్ళ త్యాగశీలాన్ని మరోసారి స్మరించి నేటి సమాజానికి అవసరమైన నైతిక విలువను ప్రబోధించారు.

'పరాయి జెండా నీడన బతకాల్సిన దుస్థితి'కి కలతచెందిన పింగళి వెంకయ్య మువ్వన్నెల జెండాకు రూపకల్పన చేశాడు. స్వేచ్ఛావాయువుల కోసం ఆరాటపడ్డ భరతజాతి నాడితెలిసిన నాయకులు పోరాటాన్ని ఊపిరిగా భావించిన వైనాన్ని 'జాతీయ పతాకసృష్టికర్త' పింగళి వెంకయ్య వ్యాసంలో ఆవిష్కరించారు.

'స్వరాజ్యం మా జన్మహక్కు' అన్న తిలక్ గురించి రాస్తూ 'లోకమాన్యుడు'లో ఆనాటి సాంఘిక, రాజకీయ ఉద్యమాల్ని రూపుకట్టించారు. భరతజాతికి సేవ చేసిన మహనీయుల గురించి రచయిత చేసిన ఉపన్యాసాలు ఎన్నదగినవి.

'పర్యావరణం'లో కలుషిత వాతావరణం మానవ జీవితానికి ఎలాంటి నష్టాన్ని కలిగిస్తుందో వివరించారు. ప్రధాన నగరాల్లో పెరిగిపోతున్న వాయుకాలుష్యం కొత్త కొత్త రోగాలకు ఊపిరిపోస్తున్నదని రచయిత ఆవేదన చెందుతారు.

'గ్రామాలలో వ్యవసాయాధార పరిశ్రమల ద్వారా ఉపాధి కల్పన' వ్యాసంలో భారతదేశంలో ఉన్న సహజసంపదను ఏవిధంగా ఉపయోగించుకోవాలో వివరించారు. వ్యవసాయ ప్రాధాన్యం గల మనదేశంలో నీటివనరులు అంతంత మాత్రమే. అయితే ప్రత్యామ్నాయ పరిశ్రమల గురించి అవగాహన లేక రైతులు లాభపడలేక పోతున్నారని, అలాగే ప్రభుత్వ పథకాలు గ్రామప్రాంతాలకు చేరడం లేదనే సత్యాన్ని కూడా తెలియజేస్తున్నారు.

'సృష్టిలో స్త్రీ పురుషులిద్దరూ సమాన భాగస్వాములే' అంటూ సమాజ చక్రానికి వీళ్ళిద్దరూ రెండు చక్రాల వంటి వారని చెప్పారు. ఆదిమకాలం నుండి పురుషుడు అధికుడనే సంస్కృతిని నిరసించారు. స్త్రీ పురుషులిద్దరూ సమానస్థాయిలో ఉండి, సామాజిక బాధ్యతలను సమానంగా పంచుకున్నపుడే ప్రపంచం సరైన పద్ధతిలో పురోగమిస్తుందని రచయిత భావించారు.

'కాలం' విలువైంది. 'కాలము దాటువాడు ఇల ఒకండును కూడ లేడు కుశలవాగ్రణీ' అంటారు తిరుపతి వేంకటకవులు. ఈ కాలం జాలం నేర్పింది. పుట్టిస్తుంది, నడిపిస్తుంది, గెలిపిస్తుంది, ఓడిస్తుంది. తిరిగి

జీర్ణించుకోగలుగుతుంది. ఇంతటి శక్తిమంతమైన కాలాన్ని గురించిన అవగాహన పెంచుకోమంటారు రచయిత. గతాన్ని విస్మరించిన వాడికి భవిష్యత్తు ఉండదు. భవిష్యత్తు కోసం శ్రమించిన వాడికి వర్తమానం నిలువదు. ఇది కాలికసత్యం. కాలం విలువను చక్కగా అంచనా వేశారు శ్రీ మార్కండేయులు.

'కరుగుతున్న వయస్సు'లో జారిపోయే జీవితస్థితులకు అద్దంపట్టారు. బాల్యం, యవ్వనం, తీయని జ్ఞాపకాలుగా మారిపోయి, కరిగిపోయే కాలంతోపాటు వృద్ధాప్యపు కౌగిళ్ళలోకి జారిపోతాడు. ఈ మనిషి జీవితకాలంలో ఎదురయ్యే సంఘటనలు ఎలా ప్రభావితం చేస్తాయో, వాటిపట్ల మనిషి ఎలా ప్రవర్తించాలో వివరించారు.

పొరపాటు అలవాటుగా మారితే వ్యసనంగా మారుతుందంటూ 'మత్తు' వ్యాసంలో వివరించారు. మద్యపానం, ధూమపానం వంటివి మానవుల జీవితాల్లోకి జొరబడి ఆరోగ్యాన్ని రోగాల మయం చేస్తున్నాయి. వాటిని దూరంగా ఉంచమంటూ హెచ్చరిస్తున్నారు రచయిత.

'భూమి మహత్తు' 'జన్మభూమి'లలో భూమి ఔన్నత్యాన్ని హృదయానికి హత్తుకున్నారు. భూమాత ఇచ్చే ఫలాలకు మనం ఎలాంటి ప్రతిఫలం ఇస్తున్నామో, ఆ రుణం ఎలా తీర్చుకుంటున్నామో తెలుసుకోమంటారు. సమాజశ్రేయస్సు కోరి గ్రంథాలు రాసిన రచయిత సదాస్మరణీయులు అంటారు 'నైతిక విలువల పరిరక్షణలో....కవుల, రచయితల బాధ్యత' వ్యాసంలో.

'మానవధర్మం' గురించి చెప్పినా 'అంతరాత్మ'ను బయటికి తెచ్చినా, 'క్రమశిక్షణ' బోధించినా, 'సంఘసేవ' చేసినా, 'చిత్తశుద్ధి'ని విడవకుండా రచయిత తన దృక్పథాన్ని వివరించారు. ఈ ప్రసంగవ్యాసాల్లో. వీరి రచనల్లో విశేషమేమిటంటే అన్ని విషయాలకు మహాత్ముల మాటలను జోడించడం. మంచిచెడ్డల్ని అంచనావేయడంలో రచయిత చూపించిన జాగరూకత పాఠకుల్ని ఆకర్షిస్తుంది. అసాధారణ విషయాల్ని కూడా హాయిగా చెప్పడంలో రచయిత కృతకృత్యుడయ్యారు.

ఎంతోపనుల వొత్తిడి ఉన్నప్పటికీ, సామాజిక స్పృహతో, సందేశాత్మక అంశాలతో ఏకకాలంలో రెండు గ్రంథాలను వెలువరిస్తున్న ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ ఛైర్మన్, మాన్యమిత్రులు శ్రీ జెల్లా మార్కండేయులు గారిని అభినందిస్తున్నాను. ఈ రెండు గ్రంథాలకు నాలుగు మాటలు రాయమని నన్నుకోరడం నా మీద వారికి గల స్నేహభావానికి నిదర్శనం. శ్రోతలకు వీనుల విందుచేసిన ఈ ఉపన్యాసాలు, గ్రంథరూపంలో వెలువడి పాఠక హృదయాలను ప్రభావితం చెయ్యాలని కోరుకుంటున్నాను.

గోపి

(ఎన్. గోపి)

-శ్రీమతి దుర్గాభాస్కర్
(స్టేషన్ డైరెక్టర్, ఆకాశవాణి, హైదరాబాద్)

ఏ విషయాన్నయినా మనసుకు హత్తుకునేలా చెప్పడం అందరికీ చేతనయ్యే పనికాదు. అది ఒక కళ. అందులోనూ నైతికతకు సంబంధించిన విషయాలూ, మహనీయులు చెప్పిన ఆదర్శాలూ చక్కగా వివరించడం, క్లుప్తంగా, గాఢంగా చెబుతూ వినేవారిలో ఆసక్తిని రేకెత్తించడం- ఎంతో అధ్యయనం, సంయమనం వున్నవారికే గానీ కుదిరేపనికాదు. గత పాతిక సంవత్సరాలుగా రేడియోలో అడపాదడపా చేసిన ప్రసంగాల నుంచి ఒక పాతిక అంశాలను పుస్తకరూపంలో గగనతరంగిణిగా ప్రచురిస్తున్న శ్రీ జెల్లా మార్కండేయగారి ఈ వ్యాసాలను చదివినప్పుడు ఆయనలోని ఆ ప్రతిభ స్పష్టంగా తెలుస్తుంది.

ఏ అంశం గురించి చెప్పినా ఆ అంశాన్ని గురించి తన అధ్యయనాన్నీ, అనుభూతినీ మేళవించి-విన్న నలుగురూ 'ఆహా' అని తలలూపేలా చెప్పగల మంచి దక్షత మార్కండేయగారిలో వుంది. చెప్పిన అంశాలలో మంచి వైవిధ్యం, చెప్పేతీరులో అన్ని వర్గాల శ్రోతలనూ ఆకట్టుకోగల రీతి ఆయన రచనావిధానంలో వుంది. ఒక 'గాంధేయ' భావధార ఈ వ్యాసాలన్నింటా అంతర్లీనంగా ద్యోతకమవడం కనిపిస్తుంది. చెప్పే విషయం ఏదయినా సమగ్రంగానూ, ధాటిగానూ, చక్కని విషయవివరణతోనూ, నిజాయితీతోనూ చెప్పడం ఎంతగానో అభినందించదగినది. 'మత్తు' గురించి చెప్పినా - 'కాలం' గురించి చెప్పినా-'పర్యావరణం' గురించి చెప్పినా - 'నైతిక విలువల పరిరక్షణ' గురించి చెప్పినా వారి అధ్యయనశీలం, అభివ్యక్తి నైపుణ్యాం కనిపిస్తాయి. ప్రతిదీ ఓ మచ్చుతునకే.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్ అధ్యక్షులయిన జెల్లావారు చెప్పినవెల్లా కేవలం మంచి మాటలు మాత్రమే కాదు, మంచి ఆచరణకు మనిషిని చైతన్యవంతుడిని చేసే విషయాలు. క్రమశిక్షణ, చిత్తశుద్ధి, సంఘసేవ,

మానవధర్మం మొదలయిన అంశాలను ఆయన విశ్వసించి, అనుసరించి, అనుష్ఠించి, అందరినీ ఆ మార్గంలో ఆలోచించి అడుగువేయమని ప్రబోధించే నేతృత్వ లక్షణం కూడా ఆయనలో వుంది.

"ప్రజాస్వామ్యంలో ప్రజలు పిలిచినపుడల్లా నాయకులు పలకాలి" అంటూ, గాంధీజీ- "భారతదేశానికంతకూ నియంతగా ఒక గంటసేపు నియమించబడితే ముందుగా బ్రాందీ, సారా షాపులన్నింటినీ మూయించేస్తాను...కల్లుగీసే తాళ్లనన్నింటిని నరికి వేయించేస్తాను......నేను నియంతననే మత్తులో పడను" అంటూ మత్తును ఏ విధంగా ప్రజలు అధిగమించాలో 'యంగ్ ఇండియా' లో చెప్పిన అంశాన్ని ఒక వ్యాసంలో మార్కండేయగారు వివరించారు. నిజంగా ఈ మాటలను ప్రతినాయకుడూ అనగలిగితే, అనడం మాత్రం కాదు చెయ్యగలిగితే నిజంగా ఎన్నో లక్షల మందికి ఆ నాయకులు గాంధీవలె ఆరాధ్యులవుతారు అనిపిస్తుంది.

గ్రంథాలయ వైశిష్టం గురించీ, పుస్తకాలు 'చదవండి' అంటూ వాటి ఆవశ్యకత గురించీ - ఎంతో చక్కగా వివరించారు. అలాగే 'అమ్మను చూడాలని వుంది' లో మదర్ థెరిస్సా గురించే చెప్పినా - 'అమ్మతనం' గురించీ, అమ్మను కోల్పోవడం అనేది ఒక పెద్ద దిక్కును కోల్పోవడమేననీ - వ్యక్తిపరంగానూ, దేశపరంగానూ కూడా ఆర్ద్రంగా చెప్పారు. యువతకు ఆదర్శదాయకమైన అనేక విషయాలను వివరించారు.

'జన్మభూమి' లో తనకు మేలు కూర్చినవారికే హాని తలపెట్టే 'అసలు మనిషి - తీరే అంత' అని ధర్మాగ్రహం ప్రకటిస్తూ, పర్యావరణకు, వన్యప్రాణులకు హాని కలిగించే మనిషిలోని ప్రవృత్తిని దుయ్యబట్టారు. 'మాక్స్‌నికోల్సన్' వంటి పర్యావరణవేత్తల సూక్తులను సందర్భోచితంగా ప్రస్తావించడం బంగారానికి తావి అబ్బినట్లుంది.

నిజంగా ఈ పుస్తకంలోని వ్యాసాలన్నీ కూడా చాలా ఆసక్తిగా చదివింపజేశాయి. అకాశవాణిలో చేసిన ప్రసంగ భావనలను శ్రీ జెల్లా మార్కండేయగారు ఇలా పుస్తకరూపంలో ప్రకటిస్తూ, మంచి విషయాలను భద్రపరుచుకునే అవకాశం పాఠకులకు కలిగిస్తున్నందుకు ఎంతగానో అభినందిస్తున్నాను.

"అక్షరరూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళకు కదలిక" అన్నట్లుగా - ఆలోచనాత్మకమైన ఈ వ్యాసాలను పఠించి, పాఠకులు ప్రయోజనం పొందగలరని నా ఆకాంక్ష, విశ్వాసం. వ్యాసకర్త శ్రీ జెల్లా మార్కండేయగారు ఇలాంటి సాహితీ వ్యాసంగాన్ని నిరంతరం సాగించాలని శుభాకాంక్షలతో.....

# కృతజ్ఞతలు

దాదాపు రెండున్నర దశాబ్దాల కాలం పాటు సామాజికాభివృద్ధిని దృష్టియందుంచుకొని నీతి నియమ క్రమశిక్షణలతో కూడిన చిరు అంశాలపై ఉపన్యాసాలకు అవకాశం కల్పించిన హైద్రాబాద్ 'ఆకాశవాణి' వారికి కృతజ్ఞుడను.

క్షణ క్షణము దేశ అభ్యున్నతిని, పేద బడుగు వర్గాల జీవిత విధానాన్ని మార్చి దారిద్ర రేఖను తుడిచివేయ సంకల్పించి, 'స్వర్ణాంధ్ర ప్రదేశ్'ను కోరుకునే నిరంతర కృషీవలుడు, మన ప్రియతమ యువ నాయకులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుగారు, ఈ సంపుటిని చూసి నన్ను ఆశీర్వదించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్య, గ్రంథాలయ శాఖామాత్యులు, గ్రంథాలయ శాఖలో నా వంతు సేవ చేయుటకు అనునిత్యం చేయూతనిస్తూ, అభివృద్ధికి తోడ్పడుతూ తమ అమూల్యమైన సందేశాన్ని అందించిన శ్రీ కడియం శ్రీహరిగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తక రూపానికి మార్గదర్శి తమ అమూల్య సలహా సంప్రదింపులను అందించి నన్ను ప్రోత్సహించిన శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య ఎన్. గోపిగారు, సహృదయంతో సంపుటిలోని ప్రతి అంశాన్ని పరిశీలించి తమ అభిప్రాయాన్ని తెలియజేసినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

రేడియో ప్రసంగాలను అన్నింటిని సమదృష్టితో చదివి తమ అభిప్రాయాలను తెలియజేస్తూ నిగూఢమైన భావాలను వెల్లడించిన హైద్రాబాద్ ఆకాశవాణి స్టేషన్ డైరెక్టర్ శ్రీమతి దుర్గా భాస్కర్‌గారికి కృతజ్ఞతలు.

నా బాల్య మిత్రుడు ఈ సంపుటి రూపకల్పనకు సృష్టికర్త అనునిత్యం నాతోవుంటూ ఎల్లవేళలా సహకారాన్ని అందిస్తున్న స్నేహశీలి వృత్తిరీత్యా గ్రంథపాలకుడు అయినా చలనచిత్రరంగంలో డాక్యుమెంటరీ చిత్రాలకు దర్శకత్వం వహిస్తూ రాష్ట్ర నంది అవార్డును పొందిన పి. మధుసూదనరావుగారికి, నాకు సహకరించిన శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రజాసంబంధాల విభాగ అధికారి డా. జె. చెన్నయ్యగారికి , ఆకాశవాణి కేంద్రంలో

ఎన్నో సూచనలు అందించి నాతో సహకరించిన ఆప్త మిత్రులు, రేడియో ప్రోగ్రాం అధికారులు అయిన శ్రీ పి. సుధామ, శ్రీ పి. మధుసూదనరావుగారలకు, ఆర్టిస్టు శ్రీ పి. సుదర్శన్‌గారికి, ఫోటోగ్రాఫర్ శ్రీ పి. దశరథకుమార్, ఎ.ఆర్.పి.యస్ గారికి, తప్పులు లేకుండా అందంగా అక్షరాల కూర్పు చేసిన ఓం తేజ గ్రాఫిక్స్ ప్రసూనకు, కవర్ ముద్రణ చేసిన కళాజ్యోతి ప్రాసెస్‌వారికి, చక్కగా ముద్రణ, బైండింగ్ పూర్తిచేసి పుస్తకాన్ని అందించిన సరస్వతి ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతలు.

- జెల్లా మార్కండేయ

# విషయసూచిక

# అరుదైన మహాపురుషుడు బాపూజీ

భారతదేశంమీద సర్వేశ్వరుని అపారకృప ఉన్నది. అనాది కాలం నుండి నేటి వరకు అనేకమంది మహాపురుషులు ఈ భూమి మీద అవతరించారు. ఇక్కడి జీవిత విధానాన్ని సౌభాగ్య సంపన్నం చేశారు. ఈ ప్రాచీన యుగపురుషులలో చివరివారు గాను, భవిష్యత్ యుగ పురుషులలో ప్రథమ గణ్యులుగాను గాంధీగారు అవతరించారు. గతకాలంలోని మహాపురుషులు మనకు ప్రసాదించిన దాని సారమే గాంధీజీలో మూర్తీభవించింది. భవిష్యత్తులో పరమాత్ముడు అవతరింపజేసే మహాపురుషుల బీజాలు కూడా గాంధీజీలో కన్పించాయి. ఇతఃపూర్వ ప్రయత్నాల ఫలం, భవిష్యదాశల రూపం గాంధీజీలో సాక్షాత్కరించాయి. ఈ విధంగా వారు ఒక సంధి యుగంలో జన్మించారు. ఆయన జీవితంలో భూతభవిష్యత్కాలాలు రెండూ అపూర్వంగా సమకూడి ఏకమయినాయి. ప్రతి పురుషుని గురించి ఈ విధంగా చెప్పడానికి వీలు లేదు. ప్రతి పురుషునిలోనూ వ్యక్తిగతమైన విశిష్ట లక్షణాలు ఉంటాయి. కానీ ప్రాచీన సాంప్రదాయాలకు పరిణామ స్వరూపంగాను, నూతన సాంప్రదాయానికి బీజరూపంగానూ ఉండే వ్యక్తిత్వం అరుదుగా కనిపిస్తుంది. అటువంటి అరుదైన మహాపురుషులలో గాంధీగారొకరు. నూతన భావ ప్రవర్తకుడైన యుగపురుషుడు.

గాంధీగారు సత్పురుషులన్నమాట అందరూ అంగీకరించేదే, సత్పురుషులనటమే కాక వారు నూతన భావ ప్రవర్తకులు కూడా. వారు ఒక

నూతన జీవిత దృక్పథాన్ని ప్రసాదించారు. ఇటువంటి నూతన భావాలు ప్రతి సత్పురుషుని ద్వారా ప్రకటము కావు. ఒక విశిష్టమైన పరిస్థితిలో జన్మించి, తన వ్యక్తిత్వాన్ని రూపొందించుకొన్న మహాపురుషుని హృదయంలోనే నూతన భావాలు కలుగుతాయి. ప్రతి సత్పురుషుని హృదయం ఒకే రకంగా స్పందిస్తూ వుంటుంది. కాని వారి వారి ప్రతిభావిశేషాలలో మాత్రం వ్యత్యాసం వుంటుంది. ఏ సత్పురుషుని ప్రతిభ ఆ కాలానికి అత్యంత అవసరంగా భాసిస్తుందో, ఆ సత్పురుషుడు ఆ కాలానికి యుగ ప్రవర్తకుడవుతాడు. గాంధీగారు యిటువంటి యుగప్రవర్తకుడైన సత్పురుషుడు.

సాధారణ ధర్మప్రచారమూ, విప్లవమూ అనేవి రెండూ వేర్వేరు విషయాలు. ఎల్లకాలాలలో ఋషులు, సాధువులు సాధారణ ధర్మాన్ని ఉపదేశిస్తూనే వుంటారు. కావున ఆ యుగావశ్యకత - సాధుపురుషుల ఉపదేశములు సంయోగము పొందినపుడు విప్లవము ఆవిర్భవిస్తుంది. సర్వసామాన్యమైన ధర్మప్రచార మొకయెత్తు, యుగావసరాన్ని గుర్తించి, తదనుకూలమైన ధర్మవిచారణ మరోయెత్తు. ఆంతరిక ధర్మవిచారణ యందలి బలమూ, బాహ్యాపరిస్థితుల బలమూ, ఈ రెంటిని జోడించగలిగిన వాడు "ధర్మపురుషుడు" లేక "సాధుపురుషుడు" కాక "యుగపురుషుడు" అవుతాడు. గాంధీగారు అలాంటి పురుషుడే.

ధర్మశాస్త్ర ప్రణేతలైన మహానుభావుల కోవకి చెందినవాడు బాపూజీ. ఆయనను కొంతమంది ఏసుక్రీస్తుతో పోలిస్తే, కొంతమంది తిలక్‌తో పోల్చారు. కాని వినోబా అభిప్రాయం ప్రకారము గాంధీగారిని స్మృతి గ్రంధకర్తలైన మహామునులతో పోల్చాలి. సర్వదృక్పథాలలో జీవితాన్ని సమగ్రంగా పరిశీలించి నియమ నిబంధనలు ఏర్పరిచిన మనువు యాజ్ఞవల్క్యులతో సమానులు వారు. గాంధీగారు సాంఘిక శాస్త్రవేత్తలు కూడా.

గాంధీగారికి మనువుకు తేడావుంది. మనువు చింతన ప్రాధాన్యుడయితే, గాంధీగారు సేవాప్రధానుడు. గాంధీగారు ఏక్టివిస్టు - కర్మప్రధానులు. గాంధీగారు తమ సమకాలికులను ప్రత్యక్షంగాను,

పరోక్షంగాను ప్రభావితులను చేశారు. తమ రచనల కంటే మిన్న కావడమే వారి విశిష్టత. వ్యక్తిగత జీవితాలను గమనిస్తే షేక్స్పియరు, మిల్టన్ తమ గ్రంథాలంత గొప్పవారు కారు. గాంధీగారి వ్యక్తిగత జీవితము చాలా ఉన్నతమైనదీ, శ్రేష్టమయినదీ కూడా. భావాలను అంటే 'ఎక్స్ప్రెషను' అభివ్యక్తీకరించడంలో వారు అంతగా శక్తివంతులు కారు. ఆ కారణంచేత రచనల కంటే వారి జీవితం ఎక్కువగా ప్రతిభావంతమైనది.

మహాపురుషులందరూ కరుణామయులు, వాత్సల్య భావప్రేరితులు. వారిలో జ్ఞానం అంతర్నిహితమై వుంటుంది. కరుణ వెల్లివిరుస్తుంది. గాంధీగారు ఇలాంటి మహాపురుషుడే. కారుణ్యా వాత్సల్య భావప్రేరితులై వారు చివరిదాకా ప్రజల సేవ చేస్తూనే వున్నారు. ప్రతివారు ఆయనను తనవాడే అనుకునేవారు. ఎందుకంటే ఆయన తన ఎదుటి మానవులతో సరిసమానంగా వుండే మాట్లాడేవారు. ఒకరికి కడుపులో నొప్పి వస్తే గాంధీగారు దానికి వైద్యం చెప్పేవారు. దంపతులలో జగడం వస్తే వాళ్లూ సలహా పొందడానికి గాంధీగారి వద్దకు వచ్చేవారు. అత్యవసరమైన ముఖ్యమైన పనులలో మునిగి తేలుతూ కూడా, గాంధీగారు ఇలాంటి చిన్న చిన్న విషయాలను కూడా పట్టించుకొని, వారికి తగు సలహాలు ఇస్తుండేవారు. తమ దగ్గరికి వచ్చినవారిని వారు తల్లివలె ఆదరించేవారు. వారి వారి సమస్యలను గురించి ఆలోచించేవారు. కనుకనే ప్రజలు వారి వద్దకు నిస్సంకోచంగా వచ్చేవారు. ~~ఈ~~ విధంగా వారిలో కారుణ్యాభావం వెల్లివిరుస్తూ వుండేది.

పిల్లలకు వారు పిల్లవాడి లాగానే కనిపించేవారు. స్త్రీలకు వారు సోదరిలాగా కనిపించేవారు. కనుకనే పిల్లలు, స్త్రీలు వారితో మనస్సు విప్పి మాట్లాడేవారు. ప్రతివారికి కూడా గాంధీగారు తమవాడనే అనిపించేవారు.

ఆయన దగ్గర వున్నవారంతా ఆయనను 'బాపూ' అని పిలిచేవారు. తరువాత దేశమంతా ఆయన్ను "బాపూ" అనసాగింది. చివరకు అందరూ ఆయన్ను 'జాతిపిత' అన్నారు.

మనమధ్య గాంధీగారి లాంటి మహాపురుషుడు పుట్టడం మన అదృష్టంగా భావించాలి. భగవంతుని దయ వలన ఆయన అలౌకిక పురుషుడిగా జన్మించలేదు. శుకయోగి జన్మతహా జ్ఞాని. కపిల మహాముని పుట్టగానే తన తల్లికే ఉపదేశమివ్వసాగాడు. శంకరాచార్యులు తమ ఎనిమిదవ ఏటనే వేదాభ్యాసం పూర్తిచేసి భాష్యరచనకు పూనుకున్నారు. కాని గాంధీగారు ఆ కోవకు చెందినవారు కారు. వారు సామాన్య మానవమాత్రులు. వారు జీవితంలో నిరంతర సాధన, సత్యనిష్ఠల వలనే యింత గొప్పవారయ్యారు.

వారు రోజురోజూ మారుతూ, క్షణం క్షణం వికాసం పొందుతూ వచ్చారు.

# మన గ్రంథాలయ వ్యవస్థ

"సమాచార విప్లవం"- ఇప్పుడు వినిపిస్తున్న మాట ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మనిషి అవసరాలను తీర్చడంతో పాటు ఎప్పటికప్పుడు కొత్త ప్రయోగాలను పురికొల్పుతుంది. హైటెక్ యుగంలో విప్లవాత్మక మార్పులు సంభవిస్తున్నాయి. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీలో ఆంధ్రప్రదేశ్ భారత్‌లో అగ్రగామిగా నిలుస్తుందని మన రాష్ట్ర ముఖ్యమంత్రిగారు అహర్నిశలు ఆలోచిస్తున్నారు. ఈ అభివృద్ధిని అందరూ ఆహ్వానించాలి. అరకొర చదువులతో ఆగిపోయినవారిని పుస్తక పఠనం, జ్ఞానసముపార్జనల దిశగా ప్రేరేపించాలి. దానికి తగిన అవకాశాలు కల్పించాలి. విజ్ఞాన సముపార్జనలో గ్రంథాలయాలు కీలకపాత్ర వహిస్తాయి. సమాచార విప్లవానికి వాటిని వారధులు గాను ఉపయోగించుకోవచ్చు. ప్రజలందరికి అందుబాటులో ఉండే ప్రాథమిక సమాచార విప్లవ కేంద్రాలివే. రానున్న కాలంలో వీటిని రకరకాలుగా ఉపయోగించుకోవచ్చు. ఇంతటి ప్రాముఖ్యత కలిగిన గ్రంథాలయాల పట్ల ప్రభుత్వంతో పాటు ప్రజలు కూడా బాధ్యత తీసుకోవలసి వున్నది. పఠనం వల్ల జ్ఞానం పెంపొందుతుంది. వివేకం అలవడుతుంది. వ్యక్తిత్వ వికాసానికి, పరిణతికి దోహదపడే గ్రంథాలయాల వల్ల సమాజంలో ఆరోగ్యకరమైన వాతావరణం నెలకొంటుంది. మంచి నడవడికను పెంపొందించేందుకు, ఆదర్శప్రాయమైన సమాజాన్ని రూపొందించేందుకు ఈ విజ్ఞానకేంద్రాలు దోహదపడతాయి. అందువల్ల ఆనాటి ఉద్యమస్ఫూర్తితో గ్రంథాలయాలను, పఠనాలయాలను మరింత విస్తృతంగా ప్రజాబాహుల్యంలోకి తీసుక వెళ్లాల్సిన అవసరమున్నది. ప్రస్తుతం సమాచార విప్లవానికి వారధులుగా గ్రంథాలయాలను వినియోగించుకోవడంపై ప్రభుత్వం దృష్టి సారిస్తున్నది.

వ్యక్తిని తద్వారా సమాజాన్ని తీర్చిదిద్దడంలో పాఠశాలలు, కళాశాలల ఎంత ఉన్నత పాత్రను పోషిస్తున్నాయో, గ్రంథాలయాలు అంతే పాత్రన పోషిస్తున్నాయి. ముఖ్యంగా భారత జాతీయ సంగ్రామంలో తెలుగునా గ్రంథాలయోద్యమం ప్రజలను చైతన్యవంతులను చేయడంలో, జాతీయ భావాలు పెంపొందింపజేయడంలో పోషించిన పాత్ర చిరస్మరణీయం. నేటి గ్రామాలలో, నగరాలలో, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో గ్రంథాలయాల పౌరులకు సమాచారాన్ని, విజ్ఞానాన్ని అందించడంలో అనితర సాధ్యమైన సే చేస్తున్నాయి.

భారత దేశంలోనే మొదటగా **1914**లో అయ్యంకి వెంకట రమణయ సారథ్యంలో బెజవాడ కేంద్రంగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం ఏర్పడింద **1919**లో అయ్యంకి నూరి నరసింహశాస్త్రి మొదలైన వారి సారథ్యంల మద్రాసులో అఖిల భారత గ్రంథాలయ సమావేశం జరిగింద జాతీయోద్యమంలో గ్రంథాలయాలు నిర్వహించాల్సిన పాత్ర, విజ్ఞాన పరిధి విస్తరింపజేయడం మొదలైనవి రూపుదిద్దుకున్నాయి. దీనితోపాటు సంఘ వయోజన కేంద్రాలను నిర్వహించింది. ఆంధ్రోద్యమం, మద్యపాన నిషేధం ఖద్దరు ప్రచారం, తెలుగు వ్యవహారిక భాషోద్యమం, సంఘ సంస్కరణ లాంటి అనేక ఉద్యమాలకు తోడ్పడింది. **1955**లో హైద్రాబాదు పబ్లిక్ లైబ్రరీ చట్ట ఏర్పడింది. ఆ తర్వాత **1960**లో ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టాన్ని రూపొందించారు. పౌర గ్రంథాలయాలు ప్రభుత్వ అజమాయిషీ కిందక వచ్చాయి. చట్టం వచ్చిన తర్వాత పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరేట్ ఏర్పడింద దేశవ్యాప్తంగా గ్రంథాలయాలు ఓ రూపం పొందడానికి డాక్టర్ ఎస్.ఆర్ రంగనాథన్ కృషి శ్లాఘనీయం. అయితే రాను రాను ప్రభుత్వాలక గ్రంథాలయాలపై దృష్టి తగ్గడం, అతుకుల బొంత లాంటి చట్టాలు వీటిని పడటం ఇవన్నీ ఉద్యమాన్ని కాస్త వెనక్కు నెట్టాయి. రాజ్యాంగరీత్యా పరికించి చూస్తే విద్య ఉమ్మడి జాబితాలోనూ, గ్రంథాలయాలు రాష్ట్ర జాబితాలోను ఉండటం ఇబ్బంది వ్యవహారమే.

జిల్లా గ్రంథాలయ సంస్థల నిర్వహణకు ప్రధాన ఆదాయ వనరు గ్రంథాలయ సెస్సు. పౌర గ్రంథాలయ చట్టం ప్రకారం గ్రామపంచాయతీ, పురపాలక సంఘాలు పౌరుల నుండి వసూలు చేసే ఇంటి పన్నులో రూపాయికి 8 పైసల చొప్పున పౌరులు గ్రంథాలయ పన్ను చెల్లిస్తారు. దాన్ని పురపాలక సంఘాలు సెస్సు రూపంలో గ్రంథాలయ సంస్థకు చెల్లించవలసి వుంటుంది. ఆ చెల్లింపులు ఏనాడూ సక్రమంగా జరుగలేదు. అవి ఏ ఏడాదికాఏడాది విపరీతంగా పెరిగిపోవడం, ప్రభుత్వాలు కూడా ఉదాసీనంగా వ్యవహరించడంతో గ్రంథాలయ మనుగడకు ముప్పు వాటిల్లింది. రాష్ట్రవ్యాప్తంగా సుమారు 32 కోట్ల పైచిలుకు పురపాలక సంఘాలు, గ్రామపంచాతీలు గ్రంథాలయ సంస్థలకు బకాయిలు పడ్డాయి. హైద్రాబాద్ మున్సిపల్ కార్పోరేషన్ బకాయి 19 కోట్లు - విజయవాడ కార్పోరేషన్ బకాయి 1.20 కోట్లు - సెస్సు చెల్లించని స్థానిక సంస్థలపై ఎటువంటి చర్య తీసుకోవడానికి పౌర గ్రంథాలయ చట్టంలో అవకాశం లేనందున గ్రంథాలయ సంస్థలు నిస్సహాయంగా చూడటం తప్ప చేయగలిగింది ఏమి లేదు. 1975 వరకు జిల్లా గ్రంథాలయ సంస్థలకు ఏడాదిలో ఎంత సెస్సు వసూలు అయితే అంత సమాన మొత్తాన్ని ప్రభుత్వం గ్రాంటుగా ఇచ్చేది. ఆ సొమ్ముతో గ్రంథాలయ నిర్వహణకు, సిబ్బంది జీతభత్యాలకు, పుస్తకాలు, పత్రికలు, ఫర్నిచర్, స్టేషనరీ, భవన నిర్మాణాలకు వెచ్చించేవారు. 1975 నుండి ప్రభుత్వం సెస్సుకు సమాన మొత్తంగా చెల్లించే గ్రాంటుకు బదులుగా సిబ్బంది జీతాలు, పెన్షన్ ఖర్చును గ్రాంటుగా చెల్లించడానికి అంగీకరిస్తూ ఉత్తర్వులిచ్చినా అమలు జాప్యం జరుగుతుంది. ప్రభుత్వం గ్రాంటు సకాలంలో రాకపోవడంతో అప్పుడప్పుడు అందే సెస్సును సిబ్బంది జీతాలకు, పెన్షన్లకు వాడుకోవడం ఒక ఆచారంగా మారింది. దీనితో గ్రంథాలయాలకు అవసరమయ్యే పుస్తకాలు, ఫర్నిచర్ ఇతరత్రా సమకూర్చుకోవడం గగనమవుతుంది. ప్రస్తుతం రాష్ట్రంలో 4,700 గ్రంథాలయాలు పని చేస్తున్నాయి. వీటిలో 8 ప్రభుత్వ గ్రంథాలయాలు కాగా 2,404 జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధీనంలో నడుపబడుచున్నవి. మిగిలినవి

గ్రామగ్రంథాలయాలుగా, ఎయిడెడ్ గ్రంథాలయాలుగా పని చేస్తున్నాయి. 1975 నుండి సిబ్బంది నియామకంపై ప్రభుత్వం నిషేధం విధించింది. 1981లో నిషేధాన్ని సడలిస్తూ జిల్లాకు 3 గ్రంథాలయాలు ప్రభుత్వం మంజూరి చేసింది. 1986-87లో అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం మండల కేంద్రానికో గ్రంథాలయాన్ని మంజూరి చేసింది. వాటిని "తెలుగు విజ్ఞాన సమాచార కేంద్రాలు"గా నామకరణం చేశారు. ఇవి సమాచార ప్రజాసంబంధ సాంస్కృతిక కేంద్రాలుగా పని చేయాలని నిర్దేశించినా అమలులో మాత్రం అన్ని మండల కేంద్రాలలో శాఖాగ్రంథాలయాలుగా వెలిసాయి.

జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యకలాపాలను సరళం చేయడానికై కార్పోరేట్ బాడీ హోదాలో 1988లో పౌర గ్రంథాలయ చట్టానికి సవరణ చేస్తూ "ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్"ను ప్రభుత్వం నామినేట్ చేసింది. కొత్త గ్రంథాలయాల స్థాపన, గ్రంథాలయాలకు బడ్జెట్ మంజూరు, సిబ్బంది నియామకం వంటి విధులను పరిషత్‌కు ఒప్పజెప్పారు. అయితే పరిషత్ నిర్ణయాలను ప్రభుత్వం ఆమోదించాల్సి వుంటుంది.

మన దేశంలో ప్రతి సంవత్సరం నవంబర్ 14 నుండి 20 వరకు వారం రోజుల పాటు గ్రంథాలయ వారోత్సవాలను జరుపుకోవడం ఆనవాయితీగా మారింది.

ప్రజలలో పఠనాసక్తిని పెంపొందింపజేయడం, గ్రంథాలయాలలో పుస్తకాలను, పుస్తకేతర పఠన సామాగ్రిని అభివృద్ధి పరచడం, గ్రంథాలయాలను ప్రజలకు ఉపయోగపడేలా తీర్చిదిద్దడం - వారోత్సవాల ఆశయాలు.

ఈ మూడు లక్ష్యాల సాధనకు గ్రంథాలయ వారోత్సవాలు జరిగే వారం రోజుల్లో మహానగరాలు మొదలుకొని మారుమూల ప్రాంతాల వరకు వాడవాడలా వివిధ కార్యక్రమాలు నిర్వహించబడాలి. ముఖ్యంగా విజ్ఞాన వ్యాప్తిలో గ్రంథాలయాల పాత్రను ప్రజలకు తెలియజేయడం, వారిలో పఠనాసక్తిని కలుగజేయడం, వారిని వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా ఎదిగేలా తీర్చిదిద్దడం, గ్రంథాలయాలను ఎక్కువ సమయం తెరచివుంచడం, గ్రంథాలయాలకు

అన్నిరకాల ప్రజలను ఆహ్వానించడం, పుస్తక ప్రదర్శనలను నిర్వహించడం, గ్రంథాలయ ప్రచారం, గ్రంథాలయాల్లోని వివిధ పఠన సామాగ్రులను పరిచయం చేయడం, గ్రంథాలయాల్లోని సేవలను, వనరులను, సౌకర్యాలను గురించి చెప్పడం, సమావేశాలు, సదస్సులు, గోష్టులు, ఉపన్యాసాలు, చర్చలు నిర్వహించడం, ప్రజల అవసరాలను, కోరికలను, డిమాండులను సేకరించడం, తదనుగుణంగా మంచి పఠన సామాగ్రి, పఠన పరికరాల సేకరణకు విధాననిర్ణయాలను రూపొందించుకోవడం, ఉపయోక్తలకు శిక్షణ నివ్వటం మొదలైనవి ఒక పద్ధతి ప్రకారం నిర్వహించబడాలి.

ఈ కార్యక్రమాలను కేవలం గ్రంథాలయాలు మాత్రమే నిర్వహించాలనే అపోహ ప్రజల్లో ఉంది. అదే విధంగా కేవలం పౌర గ్రంథాలయాలు మాత్రమే చేపట్టాలనే అపోహ గ్రంథాలయ సిబ్బందిలో కూడా వుంది. కాని అది తప్పు. ఈ బృహత్తర కార్యక్రమాలను పుస్తక పరిశ్రమతో ముడిపడి వున్నా, వివిధ గ్రంథాలయాలు అనగా ప్రభుత్వ, ప్రైవేటు గ్రంథాలయాలు, స్వచ్ఛంద సంస్థలు, పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, జాతీయ సంస్థల గ్రంథాలయాలు, వివిధ కేంద్ర, రాష్ట్ర అకాడమీలు, సాహిత్య సాంస్కృతిక సంస్థలు, వివిధ గ్రంథాల సంఘాలు, సమాచారవ్యాప్తితో సంబంధమున్న ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, ప్రచురణ సంస్థలు, ముద్రణాలయాలు, టోకు, చిల్లర వ్యాపారసంస్థలు, కేంద్ర, రాష్ట్ర రచయితల సంఘాలు....ఈ విధంగా అందరూ కలిసికట్టుగా పూనుకోవాలి. ఆ విధంగానే ఈ వారోత్సవ కార్యక్రమాలలో గ్రంథాలయ సిబ్బంది, ప్రచురణ కర్తలు, ముద్రాపకులు, రచయితలు, పుస్తకవిక్రేతలు, సాధారణ చదువరులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, పరిశోధకులు, గ్రంథాలయ పోషకులు, పుస్తక దాతలు, ఇతరత్రా ప్రజలందరూ పాలుపంచుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

మిగతా సంస్థల సంగతెలా వున్నా, ముఖ్యంగా గ్రంథాలయ సిబ్బంది, గ్రంథాలయాలు ఈ బృహత్తర కార్యక్రమంలో ఎక్కువ కృషి చేయవలసి

వున్నది. ఎందుకంటే తరతరాలుగా మేధావులు అందించిన విజ్ఞాన సంపదను పఠన సామాగ్రి రూపంలో భద్రపరచి కావలసిన వారికి అందించడంలో గ్రంథాలయాలు నిర్వహిస్తున్న పాత్ర నిరుపమానం. అందుకే యునెస్కో వీటి "ప్రజా విశ్వవిద్యాలయాలు" అని తేల్చి చెప్పింది.

ఇలాంటి మహోన్నత విలువలు కలిగిన గ్రంథాలయాలను విజయవంతంగా నిర్వహిస్తూ, వీటి ఆశయసిద్ధికై గ్రంథాలయ సిబ్బంది అహోరాత్రులు సేవా తత్పరతతో కృషి చేయాల్సి వుంది. **1968**లో ప్రథమ గ్రంథాలయ వారోత్సవాల సందర్భంగా భారత రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి గారు మాట్లాడుతూ, "గ్రంథాలయాల ముఖ్య ఉద్దేశ్యం కేవలం గ్రంథాలను సేకరించి భద్రపరచడమే కాదు, వాటిని ప్రజలచేత చదివించి, పుస్తకాలలోని విషయాలను వారికి తెలియజేసి, వారిలో పఠనాసక్తిని రేకెత్తించడం" అని అన్నారు. అందుచే గ్రంథాలయ వారోత్సవాలను సంప్రదాయ సిద్ధంగా కాకుండా, ఆధునిక నాగరికతకు అనుగుణంగా జరుపుకొని ఆశయసాధనకు కృషి చేయాలి.

దీనికి ప్రజాసహకారాన్ని కోరుతూ, గ్రంథాలయ అభివృద్ధి కమిటీలను , రీడర్స్ ఫోరంలను రాష్ట్రవ్యాప్తంగా ఏర్పాటు చేయుటకు ఆదేశాలు ఇవ్వడం జరిగింది.

జనసామాన్యంలో విద్యాభివృద్ధి జ్ఞానవికాసము కల్గుటకు ఏర్పడిన పవిత్ర సంస్థలు గ్రంథాలయాలు. తల్లిదండ్రులు, బంధుమిత్రులు, గురువులు ఆప్యాయత, ఆదరణ చూపి మంచి మార్గములు బోధించినట్లుగా ఉత్తమమైన ప్రతి గ్రంథం అంతకంటే ఎక్కువ ఆదరణతో మనకు మంచి మార్గాన్ని చూపగలదు. ఒక గ్రంథం మనకు గురువు, మిత్రుడు. మనకు గల ఆసక్తిని బట్టి అవి మనకు ప్రేమతో అన్ని విషయాలను నేర్పుతాయి. సరస్వతి సర్వవిద్యాదేవత. కావ్యాలు, ఇతిహాసాలు, శాస్త్రాలు, విజ్ఞాన గ్రంథాలు, ధర్మగ్రంథాలు, చరిత్రలు ఇవన్నీ సన్మార్గాన్ని చూపే సరస్వతీ స్వరూపాలు. గ్రంథ పఠనం, శ్రవణం, గ్రంథాలయసేవ సరస్వతీదేవి పూజయే అవుతుంది. ఆ పూజాఫలం విద్యాలబ్ధి. విద్యవల్లే మానవుడి మనుగడ - జీవిత పరమార్థం.

విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము
పురుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశ
బంధుడున్
విద్యనృపాల పూజితము

అని భర్తృహరి మహాత్ముడు వేదవాక్యాల వలె చెప్పాడు. సర్వ విద్యాప్రబోధకములైన గ్రంథాలయాలు సరస్వతీదేవి ఆలయాలు. జాతి అభ్యున్నతికి గ్రంథాలయ సంస్థలు దీపస్తంభాలు. అవి విజయవంతంగా సద్వినియోగమయ్యేటట్లు చూడవలసిన బాధ్యత మన అందరిది.

# పర్యావరణం

ప్రపంచ వ్యాప్తంగా కలుషిత వాతావరణ పరిస్థితి ప్రమాదకరమైన స్థాయిని చేరుకుంది. వివిధ రకాల కాలుష్యాలు విరుచుకపడి ధన, ప్రాణ నష్టాలకు దారి తీసిన సంగతిని ఒక భోపాల్, ఒక చెర్నోబిల్ గుండెలదిరి పోయేలా వివరిస్తాయి. కాలుష్యం ఏ రూపంలో వున్నా అది ప్రమాదకరమే. ముఖ్యంగా వాయుకాలుష్యం మరీనూ! మన దేశంలోని ఆరు ప్రధాన నగరాల్లో ఏటా నలభైవేల మంది వాయుకాలుష్యానికి బలైపోతున్నారు. సుమారు ముప్పైనాలుగు వేల కోట్ల రూపాయల్ని మనం నష్టపోతున్నామని, కొత్త కొత్త రోగాలు పుట్టుకవచ్చి భవిష్యత్తును భయంకరంగా మార్చి వేస్తున్నాయని నిపుణులు ఆందోళన చెందుతున్నారు. విశ్వాంతరాళంలో మరే గ్రహంలోనూ లేని వాతావరణం భూమికే సొంతం. అలాంటి వసుధ అట్టుడికి పోతుంది. తన విలువ తెలీని మనిషికి నిలువనీడనిచ్చిన విశ్వంభర విలపిస్తోంది. అవసరం పేరుతో కాల్లగొడతాడనీ, అభివృద్ధి పేరిట అరాచకానికి ఒడికడతాడనీ పుడమితల్లి ఊహించలేదేమో! పారిశ్రామిక ప్రగతి, వైజ్ఞానిక పురోగతుల మాటున పొంచిన అధోగతిని అవలోకించలేదేమో! ఇటీవల జపాన్‌లోని కోనాటోలో ముగిసిన ధరిత్రి సదస్సులో ఈ ప్రకంపనలు వినిపించాయి. నేల నాలుగు చెరుగుల నుంచి వచ్చిన 150 దేశాలు భూమాత సాక్షిగా ఆవేదనను వ్యక్తం చేసి తమ ఆలోచనలన్ని వెలికితీసాయి. అగ్రరాజ్యాల వైఖరినీ, అభివృద్ధి చెందుతున్న దేశాల నిస్సహాయస్థితినీ చూసిన వారికి భూగోళాన్ని ఆవరించిన వేడికన్నా ప్రబుద్ధుల ఆలోచనల వేడి ప్రమాదకరమైందన్న సంగతి వెల్లడయింది. అయిదేళ్ళ క్రితం బ్రెజిల్ రాజధాని రియోడి జనెరోలో ప్రప్రథమ

ధరిత్రీ సదస్సు జరిగింది మొదలు క్యోటో తీర్మానాల వరకు భూగోళ పరిరక్షణ కోసం చేపట్టిన చర్యల్ని సమీక్షిస్తే-ప్రాణులు జీవించడానికి అనుకూలమైన పరిస్థితులు భూగోళానికే పరిమితం కావడం విశేషం. మారే వాతావరణానికి తగినట్లు శారీరక ధర్మాల్లో సైతం మార్పును సంతరించుకుంటూ అనేక జీవులు ధరిత్రిని అంటిపెట్టుకుని ఉన్నాయి. శ్వాసించటం జీవుల ప్రథమ లక్షణమే కాదు ప్రధాన లక్షణం కూడా. నీరు, ఆహారం లాంటివీ అవసరమే అయినా గాలికే తొలి ప్రాధాన్యం. మనం శ్వాసించే గాలి అనేక వాయువుల మిశ్రమం.

రసాయనిక పరిశ్రమల విస్తరణ మానవాళి మనుగడకు గొడ్డలిపెట్టుగా పరిణమిస్తోంది. ముఖ్యంగా పెట్రోలియం, ఎరువులు, కీటక సంహారక మందులు, మత్తు పదార్థాలు ఉత్పత్తి చేసే పరిశ్రమలు వాతావరణ కాలుష్యానికి విస్తృతంగా దోహదం చేస్తున్నాయి. రసాయన కాలుష్యం ప్రాణికోటి అస్థిరత్వాన్ని సవాలు చేస్తోంది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన అమెరికా లాంటి దేశాలలో కమ్ముకున్న కాలుష్యమేఘాలు రాబోయే ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తున్నాయి.

పరిశ్రమల నుండి వెలువడే ఘాటైన జిడ్డుపదార్థాలను సముద్రంలోకి వదిలిపెట్టడంతో తీరప్రాంతాలలో పక్షులు, జలచరాలు ప్రాణాలు కోల్పోతున్నాయి. కాలుష్యం వర్తమాన జీవితానికి పర్యాయపదమై పోయిందనాలి. తీవ్రస్థాయిలో వెలువడే ధ్వనితరంగాల్ని సుదీర్ఘమైన అవధిలో వినడం వల్ల భౌతికంగా, మానసికంగా సంభవించే అనర్థాలు ఎన్నో ఉన్నాయి. వివిధ దేశాల్లో నిపుణులు నిర్వహించిన ప్రయోగాలు వీటిని ఋజువు చేస్తున్నాయి. అదుపు తప్పిన ధ్వనులకు పగ్గాలు వేయకపోతే వినికిడి హరించిపోయే ప్రమాదం ఉందని హెచ్చరిస్తున్నారు. శబ్దకాలుష్యం ఇప్పుడుపట్టణాల్నీ, పల్లెల్నీ వెల్లువలా ముంచెత్తుతోంది. భూగోళాన్ని ఇప్పుడు పలువురు నిపుణులు మంచం పట్టిన మనిషిలా భావిస్తున్నారు. మంచం పట్టిన మనిషికి మందో, మాకో వేస్తాం. ప్రాణవాయువు పట్టిస్తాం. ఎలాగోలా కాపాడుకోవడానికి సర్వశక్తులూ ధారపోస్తాం. కానీ మంచం పట్టిన భూగోళాన్ని కాపాడుకోవటానికి తగినన్ని మందులు, మాకులు కూడా లభ్యం కావడంలేదు.

పట్టెడంత స్వచ్ఛమైన ప్రాణవాయువు లభించడంలేదు. మరి భూగోళాన్ని కాపాడుకోవటం ఎలా?

భూమి తన సొంతమని మనిషి భావించడం వల్లనే కష్టాలన్నీ సంప్రాప్తిస్తున్నాయని ఎందరో అంటున్నారు. తన మనుగడకు అత్యావసరమైన కూడు, గుడ్డ, నీడా, నీరూ అన్నింటికీ మనిషి భూమిమీదే ఆధారపడి వున్నాడు. భూగోళం మీద ప్రధానంగా నాలుగు బయోలాజికల్ సిస్టమ్స్ ఉన్నాయని నిపుణులు చెప్తారు. అవి ఫిషరీస్, ఫారెస్ట్స్, గ్రాస్‌ల్యాండ్స్, క్రాప్‌ల్యాండ్స్. అవే మనిషి మనుగడకు, జీవికకు, పరిశ్రమలకు ప్రధానమైనవి. ఒక్క పెట్రోలియం డిరైవ్డ్ సింథటిక్స్ తప్ప మిగిలిన అన్ని రకాల పరిశ్రమలకూ భూమే ముఖ్య వరుసగా ఉంటోంది. ఈ నాలుగు సిస్టమ్స్ మీదా మనిషి చేస్తున్న దాడి బహు తీవ్రంగా ఉంటోంది. కొన్ని సందర్భాలలో అయితే, మనిషి కోర్కెలను భూమి సైతం తీర్చలేని స్థితి ఏర్పడుతోంది. దీనివలన మత్స్యసంపద నశిస్తోంది. అడవులు కనుమరుగవుతున్నాయి. పంటపొలాలు నీరు లేక బీళ్లయి పోతున్నాయి.

పర్యావరణం అనేది ఎవరి సొత్తు అనేది ఇటీవలి కాలంలో తలెత్తిన ఓ చిత్రమైన ప్రశ్న. పర్యావరణం మీద హక్కు ఏ తరానిదనే ప్రశ్న అంతరార్థం దీనికి పలువురు పలు రకాలుగా సమాధానాలు చెప్పిన మాట వాస్తవం. బ్రిటన్ ప్రధానిగా, ఉక్కు మహిళగా ప్రపంచ ప్రశంసలు అందుకున్న మార్గరెట్ థాచర్ ఒక చోట మాట్లాడుతూ, "అసలు ఈ భూమి మీద మనకూ, మన ముందువెనకాల తరాలకు ఏ హక్కూ లేదు. మనకున్నదంతా జీవితాంతం కౌలుదారీ హక్కు మాత్రమే"అన్నారు.

అయితే వెస్టర్ బ్రౌన్ ఆ మాట ఒప్పుకోలేదు. ఆయన మనకి భూమి, మనకంటె ముందు భూమిమీదకు వచ్చిన తరాల నుంచి అందింది. అది మళ్లీ భద్రంగా రాబోయే తరాల వారికి అప్పగించడం మన ధర్మం అంటారాయన.

వాస్తవాలను గుర్తించి చక్కటి పర్యావరణాన్ని అంచెలంచెలుగా పునర్నిర్మించుకొంటూ పోతే తప్ప మానవ జాతికి మనుగడే లేదు.

# గాంధీగారి దృష్టిలో ప్రజాస్వామ్యం

దేశంలోని ప్రజలందరి యొక్క భౌతిక, ఆర్థిక, అంతరాత్మిక సంపత్తి నంతటిని సమీకరించి, దేశక్షేమానికి కేంద్రీకరింపజేసే కళకు, శాస్త్రానికి ప్రజాస్వామ్య సిద్ధాంతమని సూక్ష్మప్రాయంగా పేరు పెట్టవచ్చు అనేవారు గాంధీజీ.

ఇంతవరకు మనం చేసే ప్రతిపనీ కుటుంబక్షేమాన్ని ఉద్దేశింపబడింది. ఇప్పటినుండి మనమందరం ఇతరుల క్షేమానికి, ప్రజలందరి క్షేమానికి పాటుబడటం నేర్చుకోవాలి.

గ్రామాలకు సంబంధించిన అభివృద్ధి కార్యక్రమాలు ఎన్నో మనకు తెలుసు. గ్రామీణులకు తమ తమ హక్కులేవో తెలియవు. వారి హక్కులు వారు తెలుసుకునేటట్లు చేయటానికి యింతవరకూ మనం ప్రచారం చేస్తున్నాం. ఆర్థికంగా వారెలా పైకి వస్తారో, ఏ పని చేస్తే వారికి లాభిస్తుందో తెలియబరుస్తూ ఒక్కొక్కసారి ప్రచారం చేస్తున్నాం.

ఇప్పుడు మీకొక నూతన కార్యక్రమమును చూపెడతాను. గ్రామవాసులు వారి వారి బాధ్యతలను తెలుసుకోవాలి.

బాధ్యత, హక్కు ఒకదాని ప్రక్కన ఒకటి నడుస్తుంది.

ఎవరి బాధ్యతలను వారు సక్రమంగా నిర్వహించుకుంటే హక్కులు ఉంటంతట అవే సిద్ధిస్తాయి.

హక్కులన్నింటి కంటే గొప్ప హక్కు విధినిర్వహణ. ఈ ఒక్క హక్కు కోసం మనం జీవించాలి, మరణించాలి.

ఇతర న్యాయశాస్త్ర సంబంధమైన హక్కులన్నీ ఈ హక్కుల్లో ఇమిడిపోతాయి.

మిగిలిన హక్కులన్నీ ఏ పేరుతో పిలువబడినా పీడించేవే, హింసను ప్రేరేపించేవే.

సత్యము, అహింసా సిద్ధాంతములను అనుసరించి కృతనిశ్చయులమై స్వరాజ్యాన్ని సముపార్జించాలి. తర్వాత ఆ పద్ధతులను అనుసరించి స్వరాజ్యాన్ని నిలబెట్టుకోవాలి.

నిజమైన ప్రజస్వామ్యం లేక స్వరాజ్యం హింసాపద్ధతితో సత్యేతర విధానంతో రానేరాదు అన్నారు గాంధీ.

హింసా విధానంతో స్వరాజ్యం ఎందుకు రాదని ప్రశ్నించవచ్చు. హింస శత్రువుని మిత్రునిగా చూడలేదు. శత్రుక్షయానికి మార్గాలను అన్వేషిస్తుంది శత్రువును అణగదొక్కుతుంది. లేక సర్వనాశనం చేస్తుంది. ఈ విధానం వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని అభిలషించదు.

ప్రభుత్వం అహింసా విధానంతో నడిచిననాడు వ్యక్తిగత స్వాతంత్ర్యం సర్వాంగ సుందరంగా శోభిల్లగలదు.

అసలు విషయాన్ని ప్రజలందరకూ తెలియపరిస్తే, మనలో మనకు విభేదం, వైరుధ్యం, విద్వేషం ఉండవు.

అప్పుడు మనమందరం ముక్తకంఠంతో ప్రసంగించగలం. విభిన్న భాగాలన్నింటినీ కలిపి ఒకే జాతిగా చూడగలిగితే, మనతో పాటు కలిసి పోరాడేవారినీ, మనతో కలియక పోరాడేవారినీ - అందరినీ మనం సమంగా చూడగలగాలి.

హింసారూపమే అసహనం. నిజమైన ప్రజాస్వామ్యం పెంపొందాలంటే అసహనం అడ్డు తగలకూడదు అనేవారాయన.

ప్రజలను భయపెట్టి పరిపాలన సాగించటానికి ప్రభుత్వం చేసే దురాగతాల కంటే, ప్రభుత్వాన్ని భయపెట్టి కూలద్రోయడానికి ప్రజలు చేసే దురాగతాలు ఒక విధంగా ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు ఎక్కువ అపకారం చేస్తాయి.

ప్రభుత్వ దురాగతాలు ప్రజస్వామ్యానికి బలం చేకూరుస్తాయి. ఎందుకంటే ప్రభుత్వాలను కూలద్రోసేదీ, నిర్మించేదీ ప్రజలే.

నిరంకుశత్వంలో స్వేచ్ఛాపూర్వక చర్చలు, ప్రవర్తనలు మచ్చుకైనా దొరకవు.

మంచి చేయటం నేర్చుకునేముందు చెడు చేయటానికి మనకు స్వేచ్ఛ వుండాలి. స్వాతంత్ర్యం కూడా బలవంతంగా ఒకరు భుజాలపై పెట్టకూడదు.

అత్యున్నత స్వాతంత్ర్యంలో అత్యుత్తమ క్రమశిక్షణ తొణికిసలాడుతుంది. వినయవిధేయతలు వుంటాయి.

క్రమశిక్షణ, వినయవిధేయతల నుండి ఉద్భవించే స్వాతంత్ర్యాన్ని ఎవరూ కాదనలేరు. యధేచ్ఛా స్వాతంత్ర్యం నీచత్వాన్ని సూచిస్తుంది. ఇట్టి స్వాతంత్ర్యం తనకూ ప్రమాదం, ఇరుగుపొరుగుకీ ప్రమాదం.

నిజమైన ప్రజాస్వామ్య సిద్ధాంతానికి రహస్య ప్రవర్తన ఎట్టిదైనా అడ్డు తగులుతుంది.

ప్రజాస్వామ్యం యంత్రం వంటిది కాదు. రూపం మార్చి సరిపుచ్చుకునేందుకు వీలులేదు. దీనికి హృదయ పరివర్తన అవసరం.

ప్రమాద రహితమైన మానవ సంస్థ ఏదీలేదు.

ఎంత పెద్ద సంస్థ అయితే దుర్వినియోగం చేయడానికి అన్ని ఎక్కువ అవకాశాలున్నాయి.

విజ్ఞానం, క్రమశిక్షణలతో కూడిన ప్రజాస్వామ్యానికి యీ ప్రపంచంలో అగ్రస్థానం వుంది. పక్షపాత దృష్టి, అవివేకం, మూఢనమ్మకాలు - వీటితో నిండిన ప్రజాస్వామ్యం అరాజకాన్ని ఆహ్వానిస్తుంది.

ఏ దేశ ప్రజలు తమ వ్యవహారాలను ప్రభుత్వ జోక్యంతో పని లేకుండా సరళంగా, సమర్థతతో తీర్చిదిద్దగలరో, ఆ దేశం నిజంగా ప్రజాస్వామ్య దేశమని చెప్పాలి.

ఈ పరిస్థితి ఏ దేశంలో కనిపించదో ఆ దేశపు ప్రజాస్వామ్యం నామమాత్రమని చెప్పాలి. ప్రజాస్వామ్యం ఎక్కడా కనిపించదు అనేవారు గాంధీజీ.

ప్రజాస్వామ్యంలో నాయకుడు ప్రజలు పిలిచినప్పుడల్లా పలకాలి, ప్రజలు పిలిచినప్పుడు పలకడం ప్రజానాయకుని ధర్మం.

ప్రజాస్వామ్య ప్రభుత్వం అంటే దేశంలోని ప్రజలు గొర్రెలవలె సంచరించడం కాదు.

ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వ్యక్తులు అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటించేందుకు హక్కు వుంటుంది. అంటే ఈ హక్కును ప్రభుత్వం కాపాడుతుంది.

ప్రజాస్వామ్యవాదికి అసహనం కూడదు. సహనం లేనివానికి మంచి విశ్వాసం వుండదు.

ప్రతిపక్ష వాదాన్ని వినిపించుకొనని ప్రజాస్వామ్యం వృద్ధి పొందదు. ప్రతిపక్షం వారు చెప్పేది వినక పోయినా, విని హేళన చేసినా మూర్ఖత్వాన్ని ప్రదర్శించిన వారవుతారు.

అసహనం వలన సత్యవిదూరుల మయ్యేదము.

ప్రకృతి సిద్ధంగా మనకు కొంత జ్ఞానం కలదు. ఈ జ్ఞానాన్ని భయపడక వినియోగించాలి. ప్రతిదానిని నిష్పాక్షక దృష్టితో చూడటం నేర్చుకోవాలి అని చెప్పారు గాంధీజీ.

ధర్మం, సత్యం అని మనం విశ్వసించేది, అధర్మం అసత్యంగా నిరూపించవచ్చు. అందువలన నిష్కాపట్యం అవసరం. సత్యానికి నిష్కాపట్యం బలాన్ని చేకూరుస్తుంది అన్న గాంధీగారి మాటలు వాస్తవాలు.



# స్వాతంత్ర్యం

లక్షలాది ప్రజల కష్టాలు, కన్నీళ్లు రక్తధారల ఫలితంగా ఆగష్టు 14-15 తేదీ అర్ధరాత్రి సమయంలో భారతదేశంపై స్వేచ్ఛావాయువులు వీచాయి. ఆ అపూర్వ తరుణంలో కోట్లాది స్త్రీపురుషులు తమ కష్టనష్టాలను, కన్నీళ్లను మరచిపోయారు. దేశవిభజన జరిగిందే అన్న బాధ ప్రజల హృదయకుహరాల్లో ఓ మూల దాగివున్నా పరాయిపాలన, పరదేశ పీడన తొలిగిపోయిందిలే అన్న భావన ప్రతి ముఖంలోను కొట్టవచ్చినట్లు కన్పించింది. స్వాతంత్ర్య భానోదయంతో తమ జీవితాల్లో ఎంతో మార్పు వస్తుందన్న ఆశ ప్రజల్లో వ్యక్తం అయింది.

దేశవిభజన గాంధీజీ ఆశీస్సులతో, అంగీకారముతో జరిగిందని, ఆ విధంగా ఆయన అవిభక్త భారతదేశానికి మహాపచారం చేశారని కొందరు వాదిస్తారు. 1947 జూన్ 3న దేశ విభజనపై మౌంట్ బాటన్ అవార్డును ప్రకటించారు. దానికి రెండురోజులు ముందుగా గాంధీజీ తన ప్రార్థనాసమయం కంటే అరగంట ముందుగా లేచి తన డైరీలో ఈ వాక్యాలు వ్రాసుకున్నారు. గాంధీజీ రచనలను, జీవితాన్ని భారత జాతికి ఆవిష్కరించిన డి.జి. టెండూల్కర్ సేకరించిన అమూల్య పత్రాల్లో డైరీ కూడా వుంది.

"నా తపనలో చిత్తశుద్ధికి ఇది అగ్నిపరీక్షా సమయం. నేను ఇప్పుడు ఒంటరినైనాను. సర్దార్, జవహర్‌హర్‌లాల్ కూడా నా రాజకీయ అవగాహన తప్పని, దేశవిభజనకు అంగీకరిస్తే శాంతి పునరుద్ధరణ జరుగుతుందని అంటున్నారు. దేశవిభజన జరిగినా అది బ్రిటీషు ఆధిపత్యంలో వుండగా కానీ, బ్రిటీషు వారి జోక్యంతో కానీ జరుగరాదని నేను వైస్రాయ్‌తో చెప్పడం వారికి నచ్చలేదు. వయస్సుతో పాటు నాకు చాదస్తం పెరిగిందేమోనన్న అనుమానం

వారికి కల్గినట్లుంది. అయితే కాంగ్రెసుకు, బ్రిటీషు ప్రజలకు నిజమై విధేయుణ్ణయిన స్నేహితునిగా నేను వాస్తవంగా భావించిన దానిని చెప్ప తప్పదు. నా సలహాను వారు మెచ్చుకున్నా , మెచ్చుకోకున్నా, అంగీకరించిన అంగీకరించకపోయినా నేను నిజం చెప్పక తప్పదు. ఈ మొత్తం వ్యవహారంలే మనం పెడదారిన పోతున్నట్లు నాకు స్పష్టంగా తెలుస్తున్నది. దీని ప్రభావ వెనువెంటనే కన్పించకపోయినా, ఈ మార్గంలో సంపాదించిన స్వాతంత్ర్య భవిష్యత్తు అంధకారంగా వుంటుందని నాకు అన్పిస్తున్నది. ఆ అంధకారాన్ని చూసే దురదృష్టం కలగకుండా భగవంతుడు నా జీవితాన్ని తీసుకపోవాల ప్రార్థిస్తున్నాను. అందరూ వ్యతిరేకించి నా సంపూర్ణ సత్యాన్ని చెప్పే శక్తియుక్తులను, పరిశుద్ధతను భగవంతుడు నాకు ప్రసాదించుగాక.

నేను నా ఆలోచనలతో ఒంటరిగా వున్నా, నాలో అంతర్గతంగా ఏద ఆనందం అనుభవిస్తున్నాను. మనసు ప్రశాంతంగా వుంది. భగవంతుడే నా ముందున్న మార్గాన్ని వెలుగుతో నింపేస్తున్నట్లున్నది. బహుశా, అందువల్లనే నేను ఒంటరిగానైనా పోరాడగలుగుతున్నాను. కొందరు నన్ను కాశీకో, హిమాలయాలకో వెళ్లి శేషజీవితాన్ని గడపాలని సలహా ఇస్తున్నారు. అయితే వారి సలహా వింటే నాకు నవ్వు వస్తున్నది. ప్రజలకు సమస్యల పర్వతాలు ఎక్కడ వున్నాయో అవే నాకు హిమాలయాలు. దోపిడి నివారించాల్సిన ప్రదేశమే నా పాలిట కాశీక్షేత్రం. ఇండియాలో జీవితావసరాలు తీరని వ్యక్తి వున్నంతవరకూ నాకు విశ్రాంతి లేదు. బాద్‌షాఖాన్ బాధను నేను చూడలేను. లోలోన కుమిలిపోతున్న ఆయనను తలుచుకుంటే నా గుండెను ఎవరో పిండినట్లుగా వుంది. అయితే నేను కన్నీరు కారిస్తే అది పిరికితనం అవుతుంది. మేరునగధీరుడైన ఆ పఠాన్ క్రుంగిపోతాడు. అందువల్లనే నేను నా పనిలో నిమగ్నమై పోతున్నాను. అయితే అంత తేలికగా లేదు. కావచ్చు....వాళ్లందరూ చెప్పేదే నిజం కావచ్చు. నేను చీకటిలో అలమటిస్తూ వుండవచ్చు. అయితే

అదంతా చూడటానికి నేను జీవించి ఉండకపోవచ్చు. నేను భయపడుతున్నదంతా జరిగి ఇండియాకు, ఇండియా స్వాతంత్ర్యానికి ముప్పు ఏర్పడితే భవిష్యత్తు తరాలు ఈ వృద్ధుడి ఆత్మ ఆ చీకటి గురించి తలుచుకుంటూ ఈ సమయంలో ఎంతగా తపన పడిందో, ఆరాటపడిందో అవగాహన చేసుకోవాలి. దేశవిభజనకు గాంధీ కారకుడని ఏఒక్కరూ అనకూడదు. అయితే ఇప్పుడు అందరూ స్వాతంత్ర్యం కావాలని అసహనంతో ఆరాటపడుతున్నారు."

బ్రిటీషు పాలకుల స్థానంలో దేశీయ పరిపాలన ప్రవేశపెట్టడానికి ప్రయత్నాలు, 1946 డిసెంబరు 9నే ప్రారంభం అయ్యాయి. ఎన్నుకోబడిన ప్రతినిధులున్న రాజ్యాంగసభ రాజ్యాంగరచనకు ఆ రోజునే శ్రీకారం చుట్టింది. 1929 డిసెంబరు 31, 1930 జనవరి 1 మధ్య రాత్రి లాహోర్‌లో సమావేశమై ప్రముఖులు స్వాతంత్ర్య పోరాటాన్ని ఉధృతం చేసిన సంఘటనకు గుర్తుగా అర్ధరాత్రే ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చింది. 1930 సమావేశంలో పాల్గొన్న అతిరథ మహారథులు, స్వాతంత్ర్య సమరయోధులు, సామాన్యులు 1947 ఆగష్టు 15 ఉత్సవాలలో పాల్గొనగలిగినారు. కొంతమంది ఢిల్లీలో వుంటే మరికొందరు తమ తమ నగరాలలో, పట్టణాలలో, పల్లెల్లో జాతీయజెండా ఎగరవేసి తమ ఉద్యమాల ఫలితాలను తమ జీవితకాలంలోనే ప్రజలకు అందజేయగలిగారు.

ఛాంబర్స్‌లో సమావేశం రాత్రి 10.45 గంటలకు ప్రారంభం అయింది. సందడి చేస్తున్న జనసందోహంతో గాలరీ నిండిపోయింది. బయట జనసముద్రం ఘోషిస్తున్నది. అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడి భార్య శ్రీమతి సుచేతా కృపలానీ "వందేమాతర గీతం"తో కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి. ఆ తర్వాత రాజ్యాంగసభ అధ్యక్షుడిగా వున్న రాజేంద్రప్రసాద్ ప్రారంభోపన్యాసం చేశారు. పండిత నెహ్రూ ప్రతిజ్ఞ చేయించారు. ఆయన గద్గద స్వరంతో ఆవేశపూరితమైన ప్రసంగం చేశారు. తీర్మానాన్ని చౌదరి ఖాలీకుజ్జమాన్

బలపరిచారు. డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ మద్దతు ఇచ్చారు. తర్వాత రాజ్యాంగసభ సభ్యులు ప్రతిన చేసి, తాము భారతదేశానికి, భారత ప్రజలకు పునరంకితం అవుతున్నామని, తమ జీవితాంతం దేశసేవలో నిమగ్నమవుతామని, పురాతన భారతదేశం ప్రపంచంలో తన గౌరవస్థానాన్ని పొందడానికి కృషి చేస్తామని, ప్రపంచ శాంతికి, మానవాళి సంక్షేమానికి ఇండియా తోడ్పడేందుకు సాయపడతామని ప్రకటించారు.

ఈ ప్రతిజ్ఞను డా. రాజేంద్రప్రసాద్ మొదట హిందీలోనూ, తర్వాత ఇంగ్లీషులోను చదివారు. తమ సీట్లలో నిలబడిన రాజ్యాంగసభ్యులు ప్రతి పదాన్ని గట్టిగా ఉచ్చరిస్తూ తమవంతు బాధ్యతను నిర్వహించారు. తర్వాత శంఖాలు పూరించారు. ఆ ప్రాంతం అంతా "మహాత్మాగాంధీకి జై" అనే నినాదాలతో మార్మోగిపోయింది.

పండిత నెహ్రూ కోరిక మేరకు అంతకు ముందు ఇండియాలోనూ, ఇతర ప్రాంతాల్లోనూ స్వాతంత్ర్య సమరంలో ప్రాణత్యాగం చేసిన వారి కోసం రెండు నిమిషాలు మౌనం పాటించారు.

ఇండియాకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎంత అవసరమో, దేశంలోని దరిద్ర నారాయణులకు పేదరికం నుంచి విముక్తి అంతే అవసరమని గాంధీజీ ఎపుడూ చెబుతుండేవారు. గాంధీజీతో పాటు ఆయన సూక్తులను, ఆలోచనలనూ సమాధి చేసేశారు. ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చింది 1947లో. అప్పుడు దేశంలో దారిద్ర్య రేఖకు దిగువన జీవించే వారి సంఖ్య 16 కోట్లు అయితే, 50 ఏళ్ల కాలంలో నిరుపేదల సంఖ్య 32 కోట్లకు పెరిగింది. పేదల శాతం తగ్గిందంటూ ప్రభుత్వాలు గణాంకాలను చూపించవచ్చు గాని, అర్థాకలితో 32 కోట్ల ప్రజలు అల్లాడుతున్నారంటే మన జాతి తలవంచుకోవాల్సిందే. "ఈ దేశంలో పేదలున్నంతవరకు ధనికులు, నిరక్షరాస్యులున్నంతవరకూ విద్యావంతులూ దోషులే" అన్న స్వామి వివేకానందను కూడా జాతిప్రజలు మరచిపోతున్నట్లున్నారు. ధనసమీకరణ,

సంపద కేంద్రీకరణ లక్ష్యంగా సంపన్నులు అన్ని వ్యవస్థలను తమకు అనుకూలంగా మార్చుకుంటున్నారు. పేదలు ఈ వ్యవస్థలో తమకు న్యాయం జరగదన్న నిస్పృహతో అప్రజాస్వామిక చర్యలకు పాల్పడుతున్నారు. ఈ చర్యలను అణచివేయడానికి ప్రభుత్వ యంత్రాంగం మీద వేలాది కోట్లు వ్యయం చేస్తున్నారే తప్ప పేదరికాన్ని రూపుమాపే చర్యలను చేపట్టడం లేదు. కోట్లాది యువకులు పనిపాటలు లేకుండా కాలాన్ని వృథాగా గడపవలసిన పరిస్థితి ఏర్పడింది. పనిలేని యువత ఆలోచనలు వికృత రూపాలు దాల్చుతున్నాయి. రాజ్యహింస, అప్రజాస్వామిక శక్తుల హింస మధ్య ప్రజలు నలిగిపోతున్నారు.

50 ఏళ్ల స్వతంత్ర కాలంలో ఇండియా ఏమీ సాధించలేదని కొందరూ, సాధించింది కొందరి చేతుల్లోనే కేంద్రీకృతమైందని మరికొందరు వాదిస్తున్నారు. నిజానికి 50 ఏళ్ళలో ఇండియా సాధించింది తక్కువేమీ కాదు. **1947**కు ముందు దేశంలో కరువుకాటకాలు విలయతాండవం చేసి లక్షలాదిమంది ఆకలి బాధకు తట్టుకోలేక మరణించేవారు. ఆ పరిస్థితి రాకుండా ఇండియా వ్యవసాయరంగంలో కొంతమేర ప్రగతి సాధించింది.



# జాతీయపతాక సృష్టికర్త

# శ్రీ పింగళి వెంకయ్య

"మనకంటూ సొంతంగా ఒక జెండా లేకపోవడం వల్లనే కదా పరాయి జెండా నీడన బతకాల్సి వస్తుంది, నా జాతి ఇంకెన్నాళ్లు ఈ దుర్భరమైన జీవితం గడపాలి? నా జాతి స్వతంత్రంగా తల ఎత్తుకొని తిరిగేలా ఒక జాతీయ పతాకాన్ని రూపొందించాలి" అని శ్రీ పింగళి వెంకయ్యగారు నడుం కట్టారు.

దేశంలో స్వేచ్ఛావాయువుల కోసం ఆరాటపడుతున్న రోజులవి. తెల్లదొరల కింది బానిసత్వాన్ని పారదోలేందుకు జాతి యావత్తు మత్తు నుంచి తేరుకుంటున్న శుభగడియలవి. ఒక జాతి, ఒక దేశం, ఒక సాంప్రదాయం, ఒక జీవన వికాసం ఎంతో మంది సంఘసేవకుల వల్లనే సంరక్షితమవుతూ వుంటుంది. అనువంశికమైన సాంస్కృతిక భవిష్యత్తును వారు వృద్ధి చేయడమే కాకుండా కాపాడుకుంటూ వస్తున్నారు. అలాంటి గొప్ప వ్యక్తులలో చిరస్మరణీయులు పింగళి వెంకయ్యగారు. మన జాతీయజెండా రూపకల్పనాశిల్పి, చరిత్రలో శాశ్వతంగా నిలిచిన మహనీయుడు.

"భారతదేశానికి జాతీయపతాకం

భారత ప్రజల జన్మహక్కు" అంటూ బ్రిటీష్ జెండా స్థానంలో మన జెండా ఎప్పుడు ఎగురుతుందా అని నిరంతరం ఆలోచిస్తూ వుండేవారు. పతాక రూపకల్పన విషయమై జాతీయనాయకులతో సంప్రదించేవారు. జాతీయజెండా స్ఫూర్తితో అన్ని మతాలవారు తమ విభేదాలను విస్మరించి ఏకం కావడం చూసి బ్రిటీష్ ప్రభుత్వం కన్నెర్ర చేసింది. నాగపూరు పురవీధుల్లో నుంచి జాతీయ పతాకాన్ని తీసుకపోతున్న ఊరేగింపును నిలిపేందుకు పోలీసులు నిషేధాజ్ఞలు

జారీ చేసినారు. సరిగ్గా ఆ సమయంలోనే సుప్రసిద్ధ కవి శ్యాంలాల్ గుప్త "ఝుండా ఊంచారహే హమారా" గీతాన్ని రచించారు. అగ్నికి ఆజ్యం తోడైనట్లు జాతీయ జెండాకు తోడుగా ఈ గీతం ప్రజాభిమానం పొందింది.

"మీరు జాతికి ఎనలేని సేవ చేశారు. జాతీయ పతాకాన్నందించారు. ప్రతిష్ఠ దేశ నలుమూలల పరుగులు తీసింది. దీనికి మీకందించిన పారితోషికం ఏమిటని" ఎవరైనా ప్రశ్నిస్తే ఆయన చిన్నగా నవ్వి గాంధీగారు ఏ పారితోషికం కోరి ఈ సేవ చేశారు? కొల్లాయితోనే ఉల్లాసంగా జీవితం గడుపుకున్నారు. "నిస్వార్థ సేవకు పారితోషికాలుండవు. సేవ చేయటమే కొన్ని జీవితాలకు పారితోషికం. నేను అలాంటి సేవే చేశాను" అని వినమ్రంగా సమాధానం ఇచ్చేవారు.

తన చిన్నకొడుకు ఉద్యోగం ఆయనకు సమస్యగా మారినప్పుడు తన సన్నిహితులతో "దేశంలో నేనెరుగున్న మంత్రులు, సామంతులు చాలామంది ఉన్నారు. అడిగితే వాడికి నౌకరి దొరక్కపోదు. కానీ స్వాతంత్ర్యంగా ఏదైనా ఉద్యోగం సంపాదించుకోవటములో ఘనత ఉంది" అని అన్నారాయన. పందొమ్మిది సంవత్సరాల వయసున్న సైన్యంలో చేరి దక్షిణాఫ్రికా బోయరు యుద్ధంలో పాల్గొనటానికి వెళ్లిన తెలుగు వీరుడు శ్రీ వెంకయ్యగారు. అప్పుడాయన సుమారు ఒకటిన్నర సంవత్సరాలు ఆఫ్రికాలో గడిపారు. రాజకీయాలలో బాలగంగాధర్ తిలక్ అనుయాయులు.

వెంకయ్యగారి జ్ఞానతృష్ణ అపారం. శ్రీలంక వెళ్లి కొలంబోలోని సిటీకాలేజీలో చేరి కేంబ్రిడ్జి సీనియర్‌లో కృతార్థులైనారు. లాహోర్‌లోని దయానంద్ ఆంగ్లోవైదిక కళాశాలలో చేరి సంస్కృతం, ఉర్దూ, జపాన్ భాషలు అనర్గళంగా ప్రసంగించగల సామర్థ్యం సాధించారు.

వ్యవసాయ శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు చేశారు. భూగర్భ ఖనిజాల విషయంలో అఖిల భారతదేశంలో వెంకయ్యగారు పరమ ప్రామాణికులు. వజ్రం ఎట్లా ఏర్పడేది పరిశోధించి ప్రపంచానికే ఆశ్చర్యకరమైన ఖనిజశాస్త్ర విషయాలు వెల్లడించారు.

1916వ సంవత్సరంలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో హోంరూల్ లీగ్‌వారు వెంకయ్యగారు రూపొందించిన జాతీయ పతాకాన్ని తొలిసారి ఎగరవేశారు. "న్యూఇండియా" పత్రికలో అనీబిసెంట్ జాతీయ పతాకావిష్కరణం గురించి సంపాదకీయం వ్రాశారు. 1921లో బెజవాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ కార్యనిర్వాహక సమావేశంలో గాంధీజీ వెంకయ్యగారిని జాతీయపతాకం నమూనా రూపొందించి సమర్పించవలసినదిగా కోరారు. మూడు గంటల వ్యవధిలో వెంకయ్యగారు రంగులు దిద్దిన త్రివర్ణ పతకాన్ని రూపొందించారు. గాంధీజీతో సంప్రదించి రాట్నం ఈ పతాకం మధ్యలో చిత్రించటం బాగుంటుందని సూచించారు. "యంగ్ ఇండియా" సంచికలో గాంధీజీ మన జాతీయ పతాకావిర్భావాన్ని గురించి, పింగళి వెంకయ్యగారి కృషి గురించి ప్రస్తావిస్తూ సంపాదకీయం వ్రాశారు. భారత రాజ్యాంగసభ వెంకయ్యగారి నమూనాను అంగీకరించింది. స్వతంత్ర్య భారతదేశ పతాకంలో రాట్నం బదులు అశోక చక్రానికి స్థానం లభించింది. జాతీయోద్యమంలో శ్రీ వెంకయ్యగారు అగ్రేసరులుగా ఉండేవారు. స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఉజ్జ్వలాకాశంలో ప్రకాశవంతమైన నక్షత్రం పింగళి వెంకయ్యగారు.

ॐ

# లోకమాన్యుడు

"ఈ ప్రపంచానికి మనం సృష్టికర్తలము కాము, దాని వ్యవహారాలు మన ఆధీనంలో లేవు. ఈశ్వర నిర్మితమిది. సమస్తకార్యాలు పరమేశ్వర అర్పణ చేస్తూ, ఆ భగవంతునిపైగల భక్తి శ్రద్ధలతో మనం పనులు సాగించుకోగల్గుతున్నాం. ఇదే గీత బోధించేది - మనుష్యుని కర్తవ్యం కూడా ఇదే'' అని లోకమాన్యుడు సంపూర్ణముగా విశ్వసించినారు. లోకమాన్యునకు గీతపై మక్కువ యెక్కువ, పలుసార్లు గీతాపారాయణము కావించినారు, గీతాప్రవృత్తి మార్గాన్నే తప్పని, వృత్తిమార్గాన్ని తెల్పలేదని వారి భావము - అందులో భక్తిజ్ఞానాల చర్చ మాత్రమే లేదు, భక్తి, జ్ఞాన, కర్మలకు సుందరమైన సమన్వయం వుందని వివరించారు.

భారతదేశ స్వరాజ్య సంపాదనకు అవిరళ కృషి చేసిన మహనీయులలో అగ్రశ్రేణికి చెందిన జాతీయనాయకుడు లోకమాన్య బాలగంగాధర తిలక్. దేశప్రజలను విద్యావంతులను, చైతన్యవంతులను చేయుటంతోపాటు వారి న్యాయమైన, చట్టబద్ధమైన హక్కులు, అధికారాలను సాధించడం కోసం బ్రిటీషు ప్రభుత్వంతో పోరాటం జరుపవలెనని ప్రబోధించిన లోకప్రియుడు, ప్రజానాయకుడాయన. తన ప్రయత్నంలో ఎన్ని అడ్డంకులు, ఎన్ని కష్టాలు ఎదురైనా వాటిని అత్యంత ధైర్యసాహసాలతో ఎదుర్కొని జీవితంలో తుదిఘడియ వరకూ ప్రజాసేవకు అంకితమై నిర్విరామ కృషి చేసిన నిస్వార్థ, నిరాడంబర దేశభక్తుడు తిలక్.

"కృత్రిమమైన మనసులూ, మాటలూ నిండిన యీ లోకంలో నిజాయితీగా, నిండుగా పలికే గొంతు నిజంగా ఎంతో అవసరం'' అన్నాడు తిలక్.

భారత స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో ఆయనకు గల స్థానం సమున్నతమైనది. ఆయన జీవితం పరిశుద్ధమూ, నిష్కళంకమైనది. ఆనాటి రాజకీయరంగంలో ప్రగతిశీల అతివాద భావాలను ప్రవేశపెట్టిన ఘనత ఆయనకే దక్కుతుంది. "స్వరాజ్యం నా జన్మహక్కు" అని నిర్భయంగా ప్రకటించిన ధైర్యశాలి ఆయన. "తమ కోర్కెల సాధనకు ప్రజలు ధైర్యంగా నిల్చొని పోరాడే వివేకాన్ని ప్రబోధించిన ప్రప్రథమ కాంగ్రెసు నాయకుడు తిలక్" అని జవహర్‌లాల్ నెహ్రూ ఆయనను ప్రస్తుతించాడంటే ఆయన మహోన్నత వ్యక్తిత్వం ఎలాంటిదో తెలుస్తుంది.

"సత్యము అన్నిటికంటే ఉత్తమమైన నీతి. ఇతర మార్గాల ద్వారా దేశానికి మేలు చేకూర్చలేము. సత్యాన్ని పాలించడం అగ్నిపరీక్ష వంటిది. బంగారం తేటు తేరాలంటే అగ్నిలో మండిస్తాము, సత్యపరీక్ష కూడా ఇట్టిదే" అని ప్రబోధించారు తిలక్.

మహారాష్ట్ర దేశంలో ప్రప్రథమంగా గణపతి ఉత్సవాలను సామూహికంగా నిర్వహించే పద్ధతిని ప్రవేశపెట్టింది తిలక్ మహాశయుడే. ప్రజలలో సమైక్యతను, జాతీయభావాన్ని పెంపొందించటానికి ఈ ఉత్సవాలను ప్రారంభించారాయన.

కేసరి, మరాఠీ - ఈ రెండు పత్రికలకు సంపాదకత్వం వహించి వాటిని అత్యంత సమర్థతతో నిర్వహించారు తిలక్. బ్రిటీషు పరిపాలనలో జరిగే అనేక అవకతవకలు, అన్యాయాలకు వ్యతిరేకంగా ఆయన లేఖిని నుంచి అనేక వ్యాసాలు వెలువడినవి. ప్రజల కష్టాలు, ఇబ్బందులు, వారి ఉద్యమాలు, సమస్యల గురించి వ్రాస్తూ ఉండటం వల్ల ఆయన సామాన్య ప్రజలకు, వారి ఉద్యమాలకు నాయకుడైనారు. ప్రజలు ఆయనను తమ వాక్కుగా గుర్తించారు. ఆయన పట్ల అమోఘమైన విశ్వాసం ఉంచి ఆయనను పూజించారు.

దేశంలో ప్రజలను ఉత్తేజపరచి, కర్తవ్య నిర్వహణకు సంఘటిత పరచాలని తలంచిన తిలక్ జాతీయకాంగ్రెసులో అతివాదవర్గానికి నాయకత్వం వహించారు.

'కేసరి' పత్రికలో వ్రాసిన వ్యాసాలు ప్రజలను రెచ్చగొట్టేవిగా ఉన్నవని, రాజద్రోహ నేరం మోపి 1908లో ఆయనపై విచారణ జరిపింది ప్రభుత్వం. ఈ కేసులో తిలక్ 21 గంటలు వాదన జరిపారు. జ్యూరీ ఆయనకు 6 సంవత్సరాల ప్రవాస శిక్ష విధించింది. "ఏ ఆందోళన కూడా ఒక వ్యక్తిపై కాని, ధనంపై కాని ఆధారపడి వుండదు. పని చేసే వ్యక్తుల వెంట వుండి సహకారము చూపినవాడే అవి కార్యసిద్ధిని సాధిస్తాయి" అనేవారు తిలక్.

లోకమాన్యుడు నిర్భయంగా స్వరాజ్యాన్ని కోరడం ప్రజలకు నేర్పారు. అంతకుపూర్వం స్వరాజ్యం పదానికి సరియైన అర్థం ఎవరికీ తెలియదు. అశిక్షితులైన భారతీయులు స్వరాజ్యాన్ని సరిగా నిర్వహించుకోలేరు. శిక్షితులైన పెద్దలు స్వరాజ్యం అంటేనే గజగజలాడుతున్నారు. లోకమాన్యుడు అందరి హృదయాలలోను "స్వరాజ్యం మన జన్మహక్కు. అది మనం పొంది తీరాలి" అనే నినాదాన్ని ప్రతిధ్వనింపజేశారు.

భారతదేశంలో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం సామూహికంగా ప్రజ్వరిల్లడానికి కొద్దికాలం ముందు 1920 ఆగస్టు ఒకటవ తేదీన తిలక్ స్వర్గస్థులైనారు. ప్రజల కోసం జీవించి, ప్రజల కోసం మరణించిన పరోపకార పరాయణుడు, నిర్మల హృదయుడు, నిష్కల్మష దేశభక్తుడు అయిన తిలక్ అమరజీవి. భారత స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో ఆయన పేరు శాశ్వతంగా నిలిచింది.

శుభం

# గ్రామాలలో వ్యవసాయాధార పరిశ్రమల ద్వారా ఉపాధికల్పన

పట్టణాలలో పరిశ్రమలు నెలకొల్పడం గ్రామ ప్రాంతేతరులకు ఏ విధంగాను శ్రేయస్కరం కాదని గాంధీజీ అన్నారు. గ్రామీణ ప్రాంతాలలో కుటీర పరిశ్రమలను, చిన్న తరహా పరిశ్రమలను స్థాపించి వేల గ్రామాలకు కావలసిన ఉత్పత్తి ఆ గ్రామాలలో తయారుచేయగలిగిన నాడు దేశములో నిరుద్యోగమును, వ్యాపారములో పోటీని అరికట్టవచ్చు. భారీ పరిశ్రమలకు యంత్రాలకు గాంధీజీ వ్యతిరేకి కారు. విధ్వంసానికి దారి తీసే యంత్రాలను తాను వ్యతిరేకిస్తానని గాంధీజీ ప్రకటించారు. వ్యక్తి శ్రమను తగ్గించే సామాన్య పరికరాలను, పనిముట్లను, యంత్రాలను తాను కోరుతానని కూడా ఆయన పేర్కొన్నారు. కర్మాగార సంస్థను పేర్కొంటూ గాంధీజీ, అది కేవలం కొంతమంది పెట్టుబడిదారుల స్వలాభాలకు మాత్రమే ఉపయోగిస్తుందని నిరుద్యోగ సమస్యను తీర్చలేదని అభిప్రాయపడ్డారు.

వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, ఆరోగ్యం, సాంఘిక సంక్షేమం పశుపోషణ, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు మన గ్రామాలలో స్వయంసమృద్ధి సాధించడానికి సహాయపడుతాయి. వ్యవసాయ రంగంలో కొంతవరకు అభివృ సాధించినప్పటికీ పరిశ్రమల విషయంలో మన గ్రామాలు ఆశించినంత ముందంజ వేయలేదని చెప్పవచ్చును.

గ్రామప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడానికి అనేక సమస్యల ఇబ్బందులు, ఆటంకాలు ఉంటున్నాయి. మన గ్రామ ప్రజలలో నిరక్షరాస్య నానాటికి పెరుగుతుంది. తమ పిల్లలు కుటుంబ ఆదాయానికి తోడ్పడుతార

ఉద్దేశ్యంతో పిల్లల విద్యవిషయంలో ఆసక్తి చూపక చిన్న వయసులోనే వ్యవసాయపు పనులకు, పశువుల తోలకములకు చాలమంది తల్లిదండ్రులు పిల్లలను వినియోగిస్తున్నారు. దానికితోడు గ్రామాలలోని కొద్దిమంది విద్యావంతులైనవారు పట్టణప్రాంతాలకు తరలివెళ్లి, పట్టణంలో ఉద్యోగం చేయడంగాని, స్వయంఉపాధి పథకం ద్వారా ఆర్థికసంస్థలు, బ్యాంకులు, ప్రభుత్వం అందజేస్తున్న ఋణసహాయంతో వృత్తులను చేపట్టడంగాని, చిన్నతరహా పరిశ్రమలను స్థాపించడంగాని జరుగుతుంది. గ్రామప్రాంతాలకు చెందిన విద్యావంతులు ఆయా గ్రామప్రాంతాలలోనే తమ పరిజ్ఞానాన్ని మరింత అభివృద్ధి చేసుకోడానికి కృషి చేస్తూ గ్రామాలలో ఆధునిక శాస్త్రీయ విధానాల ద్వారా వ్యవసాయ పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి పాటు పడినప్పుడు గ్రామాల ఆర్థిక పరిస్థితులు మెరుగు పరచుకొనవచ్చును.

స్వయంఉపాధి పథకం ద్వారా ధనసహాయం అందజేసేటప్పుడు గ్రామాలకు చెందిన విద్యావంతులకు గ్రామాలలోనే వారు తమ వృత్తిని చేపట్టడం, పరిశ్రమలను గాని, వ్యాపారం గాని చేయడం వంటి ఆంక్షలు విధించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

అభివృద్ధి చెందుచున్న దేశంలో వ్యవసాయానికి ప్రాధాన్యత ఇచ్చినప్పుడే పారిశ్రామికాభివృద్ధి సాధించవచ్చును. గ్రామప్రాంతాలలోనే ధనవంతులు వ్యవసాయాభివృద్ధికి సుముఖంగా ఉన్నప్పటికి పురాతన విధానాలనే అనుసరించడం వలన ఉత్పత్తి పెరగడానికి తోడ్పడడం లేదు. ఆదాయం లేని వ్యవసాయంలో కూలి గిట్టుబాటు లేని వ్యవసాయ కూలీలు పట్టణప్రాంతాలలో పూటలు గడుపుకొనే వృత్తులు చేపట్టడం వలన వ్యవసాయం దెబ్బ తింటూ ఉంది. అంతేకాకుండా తగిన నీటి వనరులు లేక వ్యవసాయదారులు తమ వృత్తిలో విశ్వాసాన్ని కోల్పోతున్నారు. గ్రామాభివృద్ధి అధికారులు విద్యావిధానాల ద్వారా ప్రజలలో చైతన్యం కలుగజేయడానికి ప్రయత్నాలు చేసినప్పటికి ఆశించినంతగా రైతులు ఆధునిక విధానాలను

చేపట్టడానికి ముందుకు రావడం లేదు. రసాయనిక ఎరువులు వేయడం, వ్యవసాయానికి ట్రాక్టర్లు ఉపయోగించడం వంటివి పెద్ద భూస్వాములు మాత్రమే చేస్తున్నారు.

పరిశ్రమలు నెలకొల్పాలనే సంకల్పం ఉన్నప్పటికీ కొంతమంది భూస్వాములు తగిన అనుభవం, పరిజ్ఞానం లేక పరిశ్రమలు నెలకొల్పడానికి సాహసించడం లేదు. కాబట్టి గ్రామప్రాంతాలలో పరిశ్రమల ప్రాముఖ్యతను వివరిస్తూ విరివిగా విద్యాకార్యక్రమాలను నిర్వహించవలయును. గ్రామాలలో పరిశ్రమలు నెలకొల్పే వారిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం గ్రామాలలో రవాణా సౌకర్యాభివృద్ధి చేయడం, ముడిసరుకులను సరఫరా చేయడం, పన్నుల రాయితీలను ఇవ్వడం,సాంకేతిక సహాయం అందజేయడం వంటివి చేయాలి. చిన్నతరహా పరిశ్రమల ద్వారా వ్యవసాయపు పనిముట్లను గ్రామాలలోనే తయారుచేసి అతి తక్కువ ధరకి లభించడమే కాక కొంతమందికి ఉపాధి కలుగజేయడానికి వీలు పడుతుంది.

గ్రామప్రాంతాలలో పరిశ్రమలను అభివృద్ధి చేసే ముందు గ్రామాల సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో మార్పును తీసుకురావలసి ఉంది. స్థానిక వనరులను గుర్తించి ఆ వనరులను సద్వినియోగం చేసుకోడానికి ప్రయత్నించినప్పుడే పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి అవకాశాలున్నాయి గ్రామాలలో విద్య, ఆరోగ్యం, నీటి సదుపాయాలు, విద్యుశ్చక్తి, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చేసినప్పుడే ఆర్థికాభ్యుదయాన్ని సాధించవచ్చు. గ్రామాలలో ఉత్పత్తి అయ్యే సరుకులకు తగు సదుపాయాలు గ్రామాలలోను, పట్టణాలలోను విస్తృతం చేయడం ద్వారా గ్రామీణ పరిశ్రమలు పట్టణాలలోని చిన్నతరహ పరిశ్రమల పోటీని ఎదురుకొనవచ్చును.

తక్కువ మొత్తాలలో చిన్నతరహా పరిశ్రమలు తయారుచేసిన విడి భాగాలను ఉపయోగించడం భారీ పరిశ్రమలకు లాభదాయకం. చిన్నతరహ పరిశ్రమలను పోటీ పరిశ్రమలుగా భారీ పరిశ్రమలు భావించక వాటిని సహాయ

పరిశ్రమలుగా తలంచినప్పుడు, రెండురకాల పరిశ్రమలు కూడా ఒకదాని సహాయంతో మరొకటి అభివృద్ధి చెందవచ్చును. సాంకేతిక శిక్షణ పొందినవారికి చిన్నతరహా పరిశ్రమలలో స్థానం ఇవ్వవలసి ఉంది. అప్పుడే ఇవి భారీ పరిశ్రమలకు అవసరమయ్యే విధంగా భాగాలను తయారుచేసి తక్కువ ధరకు వాటిని సరఫరా చేయవచ్చును.

కొన్ని కొన్ని గ్రామప్రాంతాలను ఎన్నుకొని స్థానిక వనరులు, ముడిసరుకులు ఉపయోగపడునట్లు ఆయా గ్రామాలలో ప్రభుత్వం గ్రామీణ పరిశ్రమలను నెలకొల్పవలయును.

కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాలు విజయవంతం చేయడానికి గ్రామీణ ప్రజలు, సంస్థలు ముందుకు రావాలి. భారీ పరిశ్రమల యజమానులు, పెట్టుబడిదారులు వారి పోటీ వైఖరికి స్వస్తి చెప్పి చిన్నతరహా పరిశ్రమలు తయారుచేసే విడిభాగాలను వారు ప్రోత్సహించాలి. జాతిపిత మహాత్మాగాంధీ ఆశయాలకు అనుగుణంగా గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి చేసిననాడు మన గ్రామాలు స్వయంసమృద్ధిని సాధించి, సాంఘిక, ఆర్థిక వ్యవస్థల అభ్యున్నతికి తోడ్పడతాయి. రాష్ట్రంలో దాదాపు 57 వేల గ్రామాలు, 15 వేల పంచాయితీలు ఉన్నాయి. సమిష్టి కుటుంబాలుగా ఉన్నవారంతా విభజన కావడంతో చిన్న కమతాలయ్యాయి. ఒకటి రెండు హెక్టార్ల భూమి ఉన్నవారు ఎక్కువయ్యారు. అక్షర జ్ఞానం ఉన్నవారు నూటికి నలభైమంది లోపే. కాస్త చదువుకున్నవారు కూడా తనకున్న రెండు హెక్టార్ల భూమిని ఎలా ఉపయోగించుకోవాలో తెలియడం లేదు. హెచ్చు తరగతులు చదివినవారు పట్టణాలలోని ఉద్యోగాల కోసం పరుగెత్తి నిరాశతో తిరుగుతున్నారు. ప్రాథమికవిద్య, ఉన్నతవిద్య చదివిన యువతీయువకులు చాలామంది తమకున్న వనరుల వినియోగం తెలియక వృథాగా కాలం గడుపుతున్నారు. దురలవాట్లకు లోనయ్యే అవకాశం, ప్రమాదం ఉంది.

గ్రామీణ యువతీయువకులు పెద్ద పెట్టుబడి లేకుండానే స్వయంగా

చేపట్టి తమకు జీవనోపాధి కల్పించుకునే కార్యక్రమాలు చాలా ఉన్నాయి. పండ్లతోటలు సాగు చేయాలనే వారికి సాధ్యమైన అంట్లు లభించడం లేదు. నాణ్యమైన చెట్లను ఎన్నిక చేసి, వాటికి కట్టిన అంట్లు మగ్గంట్లకు చాలా డిమాండు ఉంది. ఆడవాళ్లు కూడా ఈ పని నేర్చుకోవచ్చు. పండ్లు కోత కోసి, పండ్లను భద్రపరచడం, రవాణాకు ప్యాకు చేయడం మొదలైన వాటిలో కూడా కొత్త పద్ధతులున్నాయి. దీనిలో మెలకువలు నేర్చుకుంటే చెడిపోయే పండ్ల సంఖ్య బాగా తగ్గుతుంది. అధిక ఆదాయం వస్తుంది. నాణ్యత పెంచితే విదేశాలకు ఎగుమతులు పెరుగుతాయి.

ఒక హెక్టారులో మల్బరీ సాగుచేసి పట్టుకాయల ఉత్పత్తి చేపడితే భార్యాభర్తలకు సంవత్సరం పొడుగునా పని ఉంటుంది. ఒక హెక్టారు భూసాగుతో ఆరు పాడి పశువులను పెంచి పాల ఉత్పత్తి చేపట్టవచ్చు. మాంసానికి డిమాండు పెరుగుతోంది. ఉత్పత్తి చాలడం లేదు. మేకలు, గొర్రెలను మేపే భూములు లేవు. సాంప్రదాయ పద్ధతిపై ఇండ్లవద్ద కొట్టంలో పెంచే విధానాలు చేపట్టవచ్చు. పొలంలో గడ్డిసాగు, ఇంట్లో జీవాల పెంపకంలో యువతీయువకులు పనులను పంచుకోవచ్చు.

ఈ విధంగా గ్రామీణ వ్యవసాయ రంగంలో ముఖ్యమైనది పాడి పరిశ్రమ.

పాడిపంటలు పుష్కలంగా ఉన్న సంవత్సరమే రైతులకు నిజమైన పండుగ. పుష్కలమైన ఉత్పత్తులకు సరైన గిట్టుబాటు పలికినప్పుడే రైతుల ఆర్థికంగా అభివృద్ధి చెందుతారు. మన దేశంలో జనాభాతో పాటు నిరుద్యోగుల సంఖ్య కూడా బాగా పెరుగుతోంది. గ్రామాలలోని వనరులనే ఉపయోగించుకొని జీవనాధారం కల్పించుకోవడం అవసరం.

అనుకూల పరిస్థితులున్న చోటల్లా పాడిపశువుల పోషణ చేపట్టి చిన్న డెయిరీలు ప్రారంభించి పాల ఉత్పత్తికి తోడ్పడవచ్చు. మార్కెటు ఉంటే గ్రామాలలోనే అమ్మవచ్చును. లేని ఎడల దగ్గరున్న పట్టణాలకు తీసుకువెళ్లి

అమ్మవచ్చు. అమ్మగా మిగిలిన పాల నుండి పాలఉత్పత్తులు తయారు చేసుకోవచ్చు. మార్కెట్ లేనప్పుడు వెన్న, నెయ్యి తయారుచేసి మార్కెటింగ్ చేయవచ్చు. కరెంటు ఉన్నచోట పాలను చల్లదనం చేసే యంత్రాలు, రిఫ్రిజిరేటర్లు, బాటిల్ కూలర్లు పెట్టుకొని పాలను, పాల ఉత్పత్తులను నిల్వచేసి పట్టణాలలో అమ్ముకోవచ్చు.

పాలతో పెరుగు, పుల్లటి పెరుగు, స్వీటు, స్వీటెండు యోగర్ట్, శ్రాఫిండ్, మజ్జిగ, లస్సీ, బాదంపాలు, స్టెరిలైజ్డ్ పాలు, మిల్క్‌షేక్, కోవా, పాలకోవా, పనీర్ ఎన్నో రకాల ఉత్పత్తులను చేసి మార్కెటింగ్ చేసుకోవచ్చు.

**పౌల్ట్రీలు:**

కోళ్ల పరిశ్రమలో అధిక లాభాలు గడిస్తూ ఎంతోమంది నేడు ఉపాధి కల్పించుకొన్నారు. నేడు పల్లె నుండి మొదలుకొని ఢిల్లీ వరకు గుడ్లు రవాణా జరుగుతోంది. సామాన్యునికి అందుబాటులో కూరగాయల కన్న చౌకగా పసిపాపల నుండి పండువృద్ధుల వరకు పసందైన ఆహారంగా గుడ్డు నిలిచింది. నిలువలు దాచాలి. మార్కెటింగ్ లేదు అనే అపనింద పడనిది గుడ్ల మార్కెట్. అందువలన కోళ్ల పరిశ్రమలో అధికోత్పత్తి సాధించాలంటే ఉత్తమమైన కోళ్ల జాతుల ఎన్నికతో బాటు పుష్టికరమైన మేత సమకూర్చాలి. పెంచే రకాన్ని బట్టి వివిధ వయస్సులలోని కోళ్లకు సమకూర్చవలసిన పోషక పదార్థాల విలువలు పరిమాణం మారుతుంటాయి. మాంసోత్పాదనకు వినియోగించే బ్రాయిలర్ రకం కోళ్లు అతి వేగంగా పెరిగే స్వభావం కలిగినందున వాటి పెరుగుదలకు అనువైన మాంసకృత్తులను, శక్తినిచ్చే పోషక పదార్థాలను తగు పరిమాణంలో అందజేయాలి. రోగనిరోధక చర్యలను తీసుకుంటూ జాగ్రత్తలు వహిస్తే లాభదాయకమైన పరిశ్రమ ఇది.

**తేనెటీగల పరిశ్రమ:**

తేనెటీగల పరిశ్రమకనువైన సహజ వనరుల గురించి ఆలోచించితే ప్రపంచంలోకెల్లా మన దేశం మొట్టమొదటి స్థానంలో ఉంది. కాని తేనెటీగల

పరిశ్రమ, తేనె ఉత్పాదన విషయంలో మనం చిట్టచివర ఉన్నాం. శీతలదేశ
అమెరికా సంయుక్తరాష్ట్రాలు, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ వంటి దేశాలలో చె
ఫలపుష్ప భరితంగా ఉండేవి సంవత్సరంలో చాలా కొద్దికాలం మాత్రమే. మి
కాలమంతా మంచుతో కప్పబడి ఉంటాయి. తేనెటీగల పరిశ్ర
ముడిపదార్థం పుష్పాలలోని మకరందం అతి తక్కువ అవకాశాలున్న ఆ శీ
దేశాలలో తేనె ఉత్పత్తి మిలియనుల టన్నులు కాగా సంవత్సరం పొడ
సస్యశ్యామలంగా ఫలపుష్ప భరితమైన మన ప్రకృతి నుంచి కనీసం 5 శ
మకరందాన్నైనా మనం తేనెగా మార్చుకోలేక పోతున్నాం. దానికి ముఖ్య
కొన్ని కారణాలు చెప్పవచ్చు. రైతుల అశ్రద్ధ, కాలానుగుణ
వ్యవసాయపనులు సాగించే మన రైతాంగం సంవత్సరంలో సగం క
ఖాళీగానే ఉంటారు. తేనెటీగల పెంపకం వంటి వ్యవసాయపర
చిన్నపరిశ్రమను చేపట్టరు. మరో విషయం ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరి వల్ల తగి
సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన వారికి అందుబాటులో లేక మన ప్రకృ
95 శాతం మకరందాన్ని వృధా పరుచుకొంటున్నాం.

**ఇక మరో పరిశ్రమ:**

ఆదివారం రోజున మాంసాహార దినంగా భావించడం పట్టణా
ఆనవాయితీ అయింది. పల్లెల్లో పండుగలకు, విందులకు మాత్ర
మాంసాహారం తీసుకునే వారు. ఇప్పుడు అందరూ అలవాటు పడ్డారు.

మన దేశంలో సగటు మాంసం వాడకం ప్రపంచంలో సగటు మా
వాడకంకన్నా చాలా తక్కువగా ఉన్నా దినదినం యాట మాంసం
పోయింది. దానికి కారణం పెరుగుతున్న మాంసాహారులు, తరుగు
గొర్రెలు, మేకలు.

గ్రామీణప్రజలు ఇది గ్రహిస్తే, గొర్రెలు, మేకలు, కోళ్లు, పంద
కుందేళ్లు, కౌంజులు పెంచి ఆర్థికవనరులను ఆదాయక్రమాన్ని పెంచుకోవ
తమ అందుబాటులో ఉన్న గ్రామీణ పరిశ్రమలను తలంచక గ్రామప్రజల
పట్టణాలపై మోజుతో వలస వెళ్లి కూలీలుగా, రిక్షా లాగువారిగా శక్తిని వ్యర
వృధా చేసి సరియైన జీవనోపాధి ఉండడానికి గృహవసతులు

మురికివాడలలో నివాసం ఏర్పరచుకొని అనారోగ్యానికి గురికావడం జరుగుతూ వుంది. జనం పెరిగిన పట్టణాలలో కలుషితం పెరిగి ప్రమాదాలకు గురియై అకాల మరణాలు సంభవిస్తున్నాయి.

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ద్వారా మరియు హరిజన, గిరిజన సంక్షేమ శాఖల ద్వారా ప్రభుత్వం గ్రామీణ ప్రజలకు ఎన్నో రకాల రాయితీలను ఏర్పాటు చేస్తూ ఉంది. చిన్నతరహా పరిశ్రమలకు ఋణాలను అందచేస్తూ రాయితీలను ఇచ్చి చేతి పరిశ్రమలను వ్యవసాయ పరిశ్రమలను ప్రోత్సహిస్తూ ఉంది. గొట్టపుబావులు సామూహిక బావులు కరెంటుమోటార్లతో బాటు సామూహిక అడవుల పెంపకానికి నర్సరీలు పెంచుటకు ఆర్థిక సహకారం అందిస్తూ ఉత్సాహపరుస్తూ ఉంది. వృత్తిపరమైన విద్యను నేర్చుకొనుటకు ట్రైజం లాంటి వసతులు ఏర్పాటు చేయబడ్డాయి. స్వయంఉపాధి వల్ల కార్మిక, కర్షకుల గౌరవాలు పెరుగుతాయి. నైతికంగా గ్రామప్రజలు మనోధైర్యాన్ని పెంచుకోగలుగుతారు.

తోటల పెంపకం చేపట్టిన రైతుసోదరులకు ప్రభుత్వం వాటర్‌షెడ్ స్కీం క్రింద మేలురకమైన పండ్ల మొక్కలను ఉచితంగా పంపిణీ జరిపి ప్రోత్సహిస్తూ ఉంది. పంపుసెట్లు, పైపులు, స్ప్రింక్లర్స్ లాంటి ఎన్నో ఏర్పాట్లు రాయితీలపై వసతి కల్పిస్తూ ఉంధి నీటిపరివాహక ప్రాంత అభివృద్ధి పథకం ద్వారా భూసంరక్షణ వరదకట్టలు నిర్మించుచూ, వ్యవసాయ ప్రదర్శనాక్షేత్రముల నిర్వహణ, పచ్చిక బయళ్లు పెంచడం, తోటల, సామాజిక అడవుల పెంపకం, గల్లీ కంట్రోల్ వర్క్స్, జీవగట్లు మొదలగు అభివృద్ధికరమైన సహాయ సహకారాలను అందిస్తున్న ప్రభుత్వ లక్ష్యాన్ని గౌరవించి గ్రామీణ ప్రజలు స్వయం పోషకత్వం యేర్పరుచుకొని గ్రామాభివృద్ధికి తోడ్పడితే దేశం సస్యశ్యామలమవుతుంది. సౌభాగ్యాన్ని సమకూర్చుకొంటుంది. మానవకృషికి, ప్రకృతి సహకారం తోడైన నాడే సుజలాం, సుఫలాం మలయజ శీతలాం సస్యశ్యామలం మాతరం వందేమాతరం.

# జీవితనౌక

సృష్టిలో స్త్రీ పురుషులిద్దరూ సమాన భాగస్వాములే. సమాజరథాని వారిద్దరూ రెండు చక్రాల వంటివారు. జీవిత నౌకకు చుక్కాని వంటివారు. ఆ విషయంలో ఎక్కువ తక్కువ ప్రసక్తే లేదు. అయితే అనాదిగా పురుషులు తా అధికులమని భావించి స్త్రీలను చిన్నచూపు చూస్తున్నారు. ఆడదానికి అబ అన్న ముద్ర పడిపోయింది. వెనుకటి కాలంలో స్త్రీలు ఆ విషయాన్ని తాముకూ అంగీకరించారు. దాంతో సమాజంలో వారి స్థానం ద్వితీయ శ్రే చేరిపోయింది. అన్ని రంగాలలోను పురుషులదే పైచేయి అయిపోయింది. స్త్రీ ఏ పని చేయవచ్చు, ఏది చేయకూడదు అన్న విషయంలో అనేక ఆంక్ష కట్టుబాట్లు ఏర్పడ్డాయి. ఆడదానివి నీకిది పాడి కాదు - అన్నమాట తరచూ స్త్రీ నోటనే వినపడేటట్లు చేసిన ఘనత పురుష సమాజానిది. ఈ పరిస్థితి మ స్త్రీలు తాముకూడా మగవారికేమి తీసిపోమనీ ఎందులోను తక్కువ వా కామని గ్రహించటానికి ఎన్నో యుగాలు పట్టింది. ఆ గ్రహింపు కలిగిన తర్వా పురుషులతో సమానంగా వుండటానికి, తమ హక్కులను సాధించుకోటా ప్రయత్నాలు ప్రారంభించేందుకు మరికొంత కాలం పట్టింది. ఈనాటికి ఆ విషయాలలోను మహిళలు మగవారితో దీటుగా వున్నారా అన్న ప్రశ్న ఉదయ వచ్చే సమాధానం సందేహాస్పదమే. "స్త్రీని అబల అనడం కన్నా దూషణ అవ వేరేమి ఉండదు" అన్నారు మహాత్మాగాంధీ ఒక సందర్భంలో. పురుషులు ( ఎడల చేస్తున్న అన్యాయాలలో యిది కూడా ఒకటి అని కూడా ఆయన అన్నా కాని స్త్రీ తాను అబలను కాదు, సబలనే అని రుజువు చేసుకోటానికి యి తంటాలు పడుతూనే వుంది.

"నరుడు లేక నారి చరితార్థ కాలేదు, నారి లేక నరుడు క్రూరుడౌ నలువ కలల పంట నారి నరుల జంట" అన్నారు నార్లవారు. ఆ మాటలు ఆ

సత్యాలే అయినప్పటికీ సమాజంలో స్త్రీలు యిప్పటికీ సమానత్వాన్ని సాధించలేకపోతున్నారు. అనేక కారణాల వల్ల కొన్ని రంగాలలో వారికి ప్రవేశమే లభించడం లేదు. కొన్ని దేశాలలో స్త్రీలకు యింకా ఓటు హక్కే లేదు. ఇన్ని వ్యతిరేక పరిస్థితులను ఎదుర్కొంటూ కూడా స్త్రీలు పురోభివృద్ధిని సాధిస్తూ వుండటమే విశేషం. "మా యింట్లో ఎక్కువ తక్కువల ప్రసక్తే లేదు. సంసార నిర్వహణలో నేనూ, మా ఆయనా సమాన బాధ్యతలు నిర్వహిస్తుంటాం. ఆయన పని చేసి జీతం తెస్తుంటారు. నేను ఖర్చు పెడుతుంటాను" అందట ఓ ఇల్లాలు. భార్యాభర్తలన్నాక యీ బాపతు చమత్కారాలు వుంటూనే వుంటాయి. కాలం ఎంతగా మారుతున్నప్పటికీ మనుషుల మధ్య సమానత్వం సాధించడమన్నది ఒక కలగానే మిగిలిపోతోంది. స్త్రీ పురుష విభేదాలు, పేద ధనిక తారతమ్యాలు అలాగే వుంటున్నాయి తప్ప తగ్గటం లేదు.

"అభ్యుదయాంశువులన్న మూలలను నవనవోజ్జ్వల జీవనంపు దీపముల వెలిగించుచుండె, నీ విశ్వమంతయును విశ్వకళ్యాణ మందిరమయ్యె" అంటూ హెచ్చుతగ్గులు లేని భవిష్యత్ ప్రపంచాన్ని తన ఆలోచనా లోచనాలలో దర్శించి పులకితులయ్యారో కవి.

సామాజికంగా ఆడవారికి, మగవారికి మధ్య ఎన్నో అంతరాలు రాజ్యం చేస్తుంటాయి. హక్కులలోను, అధికారాలలోను మగవారి ఆధిక్యమే ఎక్కువగా వుంటోంది. వేదికల మీది ఉపన్యాసాలలోను, మాటలలోను, కాగితాల మీదా తప్పితే సమానత్వం అన్నది నిజజీవితంలో కన్పించటం లేదు. ఆఖరికి సంఖ్యాపరంగా కూడా ఆడవారు అడుగుననే వున్నారని గణాంక వివరాల వల్ల తెలుస్తున్నది. ఈ శతాబ్దానికి సంబంధించినంత వరకు స్త్రీలకంటే పురుషుల సంఖ్యే ఎక్కువగా వున్నది. ప్రస్తుత సమాజంలో ఏ కుటుంబం వారయినా కొడుకులే పుట్టాలని కోరుకుంటున్నారు. ఆడపిల్లలు జన్మిస్తే అదో ఆపదగా భావించి చింతిస్తున్నారు. అంతే కాక ఆధునిక విజ్ఞానం అమితంగా పెరిగిపోవడంతో పుట్టబోయే బిడ్డ ఆడో మగో ముందే తెలుసుకోగల అవకాశాలు

ఏర్పడ్డాయి. గర్భస్థ శిశువు ఆడపిల్ల అని తెలిసినప్పుడు భ్రూణహత్యలకు పాల్పడటం కూడా జరుగుతోంది. ఇలాంటి కారణాలన్నింటి వల్లా స్త్రీపురుష జనాభా నిష్పత్తిలో తేడా వుంటోంది. సంఖ్యాపరంగా సమతుల్యం లోపించటం వల్లా అనేక దుష్పరిణామాలు సంభవించే అవకాశాలున్నాయి. కాని ఈ విషయాన్ని పురుషాధిక్య భావం అధికంగా గల సమాజం గుర్తించటం లేదు. ఈ పరిస్థితి మారాల్సిన అవసరం ఎంతైనా వుంది. స్త్రీపురుషులిద్దరూ సమాన స్థాయిలో వుండి సామాజిక బాధ్యతలను సమంగా పంచుకున్నప్పుడే ప్రపంచం సరియైన పద్ధతిలో పురోగమించగలుగుతుంది.

స్త్రీ చేయూత లేనిది సంసారంలో సారం వుండదు. మనస్సులు కలిసిపోవాలి. మంచిని పంచుకోవాలి, సహజీవనం ఆయురారోగ్యాలను పెంచుతుంది. సుఖశాంతులను పంచుతుంది.

సంసార సాగరంలో ఈ జీవిత నౌకాయానం సుఖశాంతులతో సాగాలంటే, స్త్రీపురుషులిద్దరు సమాన భాగస్వాములై ప్రయాణించాలి.



# కాలం

మానవేతిహాసంలో గడిచిన వెయ్యేళ్లూ విప్లవాత్మకమైనవి. అంధయుగం నుండి కంప్యూటర్ యుగం వరకూ మనిషి అంచెలంచెలుగా ఎదిగి విశ్వరూపం సంతరించుకున్న వైనం తెలుసుకోవాలంటే, కాలగర్భంలో కలిసిపోతున్న ఈ సహస్రాబ్దిని అధ్యయనం చేయాలి. గతాన్ని విస్మరించిన వారికి భవిష్యత్తు ఉండదు. గతాన్ని సవ్యంగా అర్థం చేసుకొని వర్తమానాన్ని సృజనాత్మకంగా, నిర్మాణాత్మకంగా రూపొందించుకున్న వారిదే భవిష్యత్తు. సహస్రాబ్ది పరిణామాలను, మానవ వికాస క్రమాన్నీ క్షుణ్ణంగా పరిశీలించడానికీ, కొత్త సహస్రాబ్దికి స్వాగతం పలకడానికీ, మెరుగైన సమాజ నిర్మాణానికి బాటలు వేయడానికీ ఇదే తగిన సమయం. దృక్పథాలలో దోషాలను గ్రహించి, సవరించుకోవడానికి కూడా ఇది సువర్ణావకాశం. ముఖ్యంగా భారతీయులకు ఇది అత్యంత కీలకమైన సమయం. ఇప్పుడు అలరించుకునే దృష్టి కోణంపైనే భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

గడచిన వెయ్యేళ్లనూ అంధయుగంగా విదేశీ దాడులతో గాయపడిన పాడుయుగంగా పరిగణించి, ప్రతీకారాగ్నితో రగిలే హృదయాల దృక్కోణం ఒకటి. దురాక్రమణదారులుగా వచ్చి మన గడ్డపైనే స్థిరపడి మన మట్టిలోనే కలిసిపోతున్న వారిని మనవారిగానే, మనలాంటివారిగానే ఆదరించి సహజీవనం సాగించాలనీ, భిన్నత్వంలో ఏకత్వం సాధించాలనీ, సహజీవన సౌందర్యాన్ని ఆస్వాదించాలనీ కోరుకునే మనస్తత్వం మరొకటి. మధ్య ఆసియా నుంచి మహ్మద్ గజనీ దండయాత్ర చేయడం, పానిపట్ యుద్ధంలో విజయం సాధించి బాబర్ మొగల్ సామ్రాజ్యాన్ని నెలకొల్పడం, పద్దెనిమిదో శతాబ్దంలో ఉత్తరాదిలో

అరాజకం రాజ్యం చేయడం, ప్లాసీ యుద్ధంలో గెలిచిన రాబర్ట్ క్లైం
ఇండియాలో బ్రిటీష్ పాలనకు అంకురార్పణ చేయడం హిందూ నాగరిక
మాయని మచ్చగా భావించి కుంగి పోయేవారికి, చరిత్రను తిరగదోడా
ప్రయత్నించేవారికి మనశ్శాంతి ఉండదు. వారివల్ల ఇతరులకు పై
సుఖశాంతులు ఉండవు. వివేకవంతుల లక్షణం గతాన్ని తవ్వు
కుమిలిపోవడం కాదు. వర్తమానం నుంచి మంచి భవిష్యత్తుకు ఏ విధ
బాటలు వేసుకోవాలో ఆలోచించడం. మహాత్మాగాంధీ, పండిట్ నెహ్రూ
చేశారు. వలస పాలకులు వేసిన రైళ్లనే, వారు ప్రవేశపె
ముద్రణాయంత్రాలనే వారు తెచ్చిన ఇంగ్లీషు భాషనే స్వాతం
సముపార్జనకూ, సమైక్య భారత నిర్మాణానికి సాధనా
ఉపయోగించుకున్నారు. సరిగ్గా వెయ్యేళ్ల క్రితం ఈ నేల పైనే బౌద్ధం ప్రబల
మతం. ఆ తర్వాత ఆ మతం ఇక్కడ బలహీనమై ఇతర ప్రాంతా
బలపడింది. ఇప్పుడు సహస్రాబ్ది అంతంలో బౌద్ధం నామమాత్రం
మిగిలింది. ఈలోగా ఇస్లాం, క్రైస్తవం దాడి చేసి తిష్ఠ వేశాయి. ఈ రె
మతాలూ గత వెయ్యేళ్ల భారత చరిత్రను విశేషంగా ప్రభావితం చేశ
అయినా హిందూ మతం చెక్కు చెదరలేదు. ఇంతలోనే హిందూ, ఇ
మతాలకు భిన్నంగా సిక్కు మతం పుట్టింది. ఇప్పుడు హిందుత్వ సిద్ధాం
విశ్వసించే పార్టీ నాయకత్వంలోని సంకీర్ణ ప్రభుత్వం రాజ్యం చేస్తోంది. చి
సర్వమత సమభావం, సామరస్యం, సహజీవనం జీవనవేదంగా సహ
అంచున భారత్ నిలచింది. 'గతమెంతో ఘనకీర్తి' అంటూ పాత గు
గొప్పలు చెప్పుకోకుండా "గత కాలము మేలు, వచ్చు కాలము కంటెన్"
మెట్ట వేదాంతానికి చెవి వొగ్గకుండా "మంచి గతమున కొంచెమేనోయ్"
గురజాడ వాక్యం అక్షర సత్యమని గ్రహించి ఇంతవరకూ జరిగిన పొరపా
చర్చించి బంగారు భవిష్యత్తును నిర్మించుకునేందుకు సంకల్పం చెప్పుకోవ
సందర్భమిది. అందుకు ప్రపంచవ్యాప్తంగా సంభవించిన పరిణామాలు ఏ

మానవ వికాసం ఎలా జరిగిందో, అందులో మన పాత్ర ఏమిటో తెలుసుకోవాలి. మరింత మానవీయమైన సమాజాన్ని నిర్మించుకోవాలంటే అన్ని మతాలూ, అన్ని జాతులూ, అన్ని వర్గాల ప్రజలూ సుఖశాంతులతో సహజీవనం చేసి ఈ ప్రపంచాన్ని స్వర్గధామంగా, ఈ భూగోళాన్ని నందనవనంగా మలచుకోవాలంటే ఏమి చేయాలో ఆలోచించాలి. ఆ పని చేయాలంటే మానవ నాగరికత ఇంతగా సుసంపన్నం కావడానికి కారకులైన మహనీయుల గురించి తెలుసుకోవాలి. శాస్త్రవిజ్ఞాన రంగంలో జరిగిన ప్రగతిని ఆకళింపు చేసుకోవాలి. మన పరిమితులను తెలుసుకోవాలి. లోపాలను సవరించుకోవాలి. మన శక్తి సామర్థ్యాలను గుర్తించాలి. మన ముందున్న విస్తారమైన అభివృద్ధి అవకాశాలను గ్రహించాలి. కాలం వేగంగా పరిగెత్తుతూ వుంది. మన వేగాన్ని బట్టి కాలం భవిష్యత్తును నిర్ణయిస్తుంది.



# "అమ్మ"ను చూడాలని వుంది...

అర్ధ శతాబ్ద కాలంగా అభాగ్యులకు అండగా నిలిచి, స్నేహహస్తం అందించి అక్కున చేర్చుకున్న కరుణామయి మదర్ థెరిసా అస్తమించారనే వార్త యావత్ ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరచింది. మదర్ మరణవార్త విన్న దేశదేశాల ప్రజలు శోకసాగరంలో మునిగిపోయారు. తన అమృత హస్తాలతో స్వాంతన చేకూర్చిన మదర్ ఇక లేరని తెలుసుకున్న అభాగ్యులు మాతృవియోగంతో రోదించారు.

అరవై ఐదేళ్ల క్రితం ఆమె ఒక మామూలు నర్స్. నేడు ఆమె విశ్వ మానవాళిచే మదర్ అనిపించుకున్న మహోన్నత మానవతామూర్తి. ఎక్కడో యుగోస్లావియాలో జన్మించి, అక్కడే చదివి, నర్స్‌గా ఐర్లండ్ వెళ్లి, అటునుంచి సర్వసంగ పరిత్యాగిగా కలకత్తా వచ్చి, తొలుత అధ్యాపకురాలిగా, తర్వాత సంఘసేవికగా, తుదకు మదర్‌గా ప్రపంచానికి ఆమె చేసిన సేవలు అజరామరం. వయస్సు మీద పడినా ఆరోగ్యం సహకరించకపోయినా కడవరకు మానవసేవా యజ్ఞాన్ని విరమించని ధీశాలి మదర్ థెరిసా. పలుమార్లు మృత్యువుతో పోరాడి అలసిసొలసిన మదర్, ఆఖరి పోరాటంలో ఓడిపోయి, శాశ్వతనిద్రలోకి నిష్క్రమించారు. ఆమె పేదల పెద్దదిక్కు. అనాథల ఆత్మబంధువు. బాధాసర్పదష్టుల అభయహస్తం. మురికివాడలను, అక్కడి ప్రజానీకాన్ని ప్రేమించి, వారికి విద్య, వైద్యం అందించిన కారుణ్యమూర్తి.

అల్బేనియన్ దంపతులకు జన్మించినా, ఆగ్నెస్ గోయింక్సా బెజాక్స్యు దేశాల సరిహద్దులను, జాతుల అంతరాలను, మతాల ఉక్కుగోడలను

ఛేదించుకుని విశ్వమాతగా అవతరించడం నిజంగా అద్భుతం. కలకత్తాలోని దిక్కూమొక్కూ లేని దీనజనులను చేరదీసి, సేవ చేయడానికి సంకల్పించినప్పుడు ఆమెకు ఎన్నో అవరోధాలు ఎదురయ్యాయి. యాభై యేళ్లనాడు కాళీమాత మందిరసమీపంలో ఒక పాడుబడిన సత్రంలో ఆమె తన సేవాకేంద్రాన్ని స్థాపించినప్పుడు, కొందరు మతఛాందసులు ఆమెను అక్కడనుండి ఖాళీ చేయించడానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు. అయినా 'మానవసేవయే మాధవసేవ' అని విశ్వసించిన మదర్ మొక్కవోని ధైర్యంతో దీక్షతో ముందుకు సాగి, స్వచ్ఛంద సేవకు మారుపేరుగా మిగిలిపోయారు.

బాధల కాసారాలన్నీ ఆమె కార్యరంగాలే, కలకత్తా వీధుల్లో చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడే విధివంచితులను మాత్రమే కాదు. తుఫాను వరదల్లో సర్వం కోల్పోయి, రోగాల బారిన పడి మృత్యుముఖానికి చేరిన బంగ్లా ప్రజానీకానికి, భోపాల్ గ్యాస్ బాధితులకు, ఇథియోపియా ఆకలి మంటలలో అలమటిస్తున్న అభాగ్యులకు, ఆర్మేనియా, లాతూర్ భూకంపం బాధితులకు - ఇలా అన్ని చోట్లా సాక్షాత్కరించి మాతృమూర్తివలె సేవలందించి, సేద దీర్చిన గొప్పతనం ఆమెది. ఆమె మరణం ప్రపంచ ప్రజానీకాన్ని యింతగా కదిలించడం అందుకే.

"దేవుడు మీలో ప్రతి ఒక్కర్నీ ప్రేమిస్తాడు. మీరంతా ఒకరిని ఒకరు ప్రేమించండి. ప్రభువు మిమ్మల్ని దీవించుగాక..." అన్న ప్రేమతత్వం ఆమె గుర్తుగా కలకాలం ధ్వనించక మానదు. "నీవు ప్రార్థిస్తే నీలో నమ్మకం పెరుగుతుంది. నమ్మకం పెరిగితే ప్రేమించడం ప్రారంభిస్తావు. ప్రేమతత్వాన్ని తెలుసుకుంటే దీనజనులకు సేవ చేయగలుగుతావు" - ఇదీ మదర్ సందేశం.

ఆమె నిగర్వి. తాను చేస్తున్నది సంఘసేవ అంటే మదర్ ఒప్పుకునేవారు కాదు. 'నా ఆత్మ స్వాంతన కోసం, ఆత్మవిముక్తి కోసం ఇదంతా చేస్తున్నాను. పేదలకు ఎందుకు సాయపడుతున్నానంటే, నా ఆత్మశాంతి కోసం అలా చేయమని ప్రభువు చెప్పార'ని ఆమె బదులిచ్చేవారు. తాను 'దేవుడి

చేతిలో కలాన్ని మాత్రమే' అన్నది ఆమె నమ్మకం. రకరకాల మతసంస్థలు, ధర్మసంస్థలు రాజకీయాలు చేయడం నాలుగు రాళ్లు వెనకేయడమే పరమావధిగా చలామణి అవుతున్న తరుణంలో అందుకు భిన్నంగా పతితులను, భ్రష్టులను, అనాథలను, అన్నార్తులను చేరదీసి, సేదదీర్చి, అన్నీ తానై ఓదార్చిన కరుణామయి మదర్ థెరిసా.

ఎయిడ్స్, కుష్టువంటి భయంకర వ్యాధులబారిన పడి, సమాజంచే త్యజించబడిన వారిని అక్కున చేర్చుకుని మందూమాకులిచ్చి ఆదరించిన ఆర్తత్రాయిని ఆమె.

'భయంకరమైన రోగాలకు గురయినవారిలో సైతం నేను ఏసుప్రభువునే చూశానని' ప్రకటించిన ప్రేమమయి థెరిసా. యాంత్రికంగా విధినిర్వహణ కోసం నిధుల కోసం సేవలు చేయడం వేరు. ప్రేమతో సేవలు చేయడం వేరు. థెరిసా రెండవ కోవకు చెందిన అరుదైన మహామనీషి.

ప్రపంచవ్యాప్తంగా 105 దేశాలలో వెలసిన 500ల కాన్వెంట్లు, 35 పురావాస కేంద్రాలు, వందలాది అనాథ శరణాలయాలు, కుష్టురోగుల చికిత్సాకేంద్రాలు, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుల సహాయకేంద్రాలు, శిశుభవనాలు ఆమె నిర్విరామ కృషిఫలాలు. ఎంత త్యాగనిరతి, ఎంతటి దీక్ష, ఎంతటి అంకిత భావం లేకపోతే ఇంతటి విస్తృతమైన సేవావ్యవస్థను నెలకొల్పడం సాధ్యం! ఆమె స్థాపించిన మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్ 2,500 మంది నన్‌లు, 400 మంది మతాచార్యులతో కూడిన ఆధ్యాత్మిక దళం ఆమె ఏ మతానికి ప్రతినిధి అన్న విషయాన్ని గాక ఆమె చేస్తున్న మానవసేవను గుర్తించి మన దేశం అక్కున చేర్చుకుంది.

సామాజిక సేవారంగంలో చేసిన కృషికి మన దేశంలోని అత్యున్నత పురస్కారం 'భారతరత్న' అందుకున్న ఏకైక మహిళ మదర్, నోబెల్ శాంతి బహుమతికి ఆమె వన్నె తెచ్చారంటే అతిశయోక్తి కాదు. పద్మశ్రీ, రామన్ మెగసెసే అవార్డులు, అంతర్జాతీయ అవగాహనకు వచ్చే జవహర్‌లాల్ నెహ్రూ

పురస్కారాలు పోప్ జాన్‌పాల్ శాంతి బహుమతి, లియోటాల్‌స్టాయ్ అవార్డు, రాజీవ్‌గాంధీ సద్భావనా అవార్డు - ఇలా అనేకానేక పురస్కారాలు ఆమెను ఎదుర్కొంటూ వచ్చాయంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. తనకు పురస్కారాలు ఇవ్వడమంటే ప్రపంచంలో 'నిరుపేదల ఉనికిని గుర్తించడం' గా ఆమె అభివర్ణించేవారు.

పున్నమి చంద్రునిలో సైతం మచ్చలను మాత్రమే చూడడానికి ఇష్టపడే వక్రబుద్ధులు మదర్‌లోనూ లోపాలు వెదకడానికి ప్రయత్నించారు. అభ్యంతరకర మార్గాల నుంచి ఆమె నిధులను స్వీకరించారన్నది మదర్‌పై వీరి ప్రధానమైన ఆరోపణ. అబద్ధాలను అచ్చుపోసి అమ్ముకోవడంలో సిద్ధహస్తులైన కొందరు మేధావులు ఆమెను "నరకలోక దేవత" అని నిందించేవరకూ వెళ్లారు. ఆమె మతం మార్పిడులకు పాల్పడ్డారన్నది మరో ఆరోపణ. కానీ ఇవేవీ ఆమె ఔన్నత్యాన్ని తగ్గించలేదు.

ఆమె పొగడ్తలకు పొంగలేదు. విమర్శలకు కృంగిపోలేదు. తనను విమర్శించినవారికోసం సైతం దేవుడిని ప్రార్థించిన సహనమూర్తి ఆమె. రాక్షసుల చేయూతలో తీసిన అమృతాన్ని నాడు లోకమాత దేవతలకు పంచినట్లు ఈ లోకమాత నిధులను ఎక్కడి నుంచి తెచ్చినా అసహాయులు, పేదల అభ్యున్నతి కోసం ఖర్చు చేశారు. పైసా సొంత ఆస్తిలేని దేవదూత ఆమె.

ఆమె మరణించినా సంఘసేవా చరిత్రలో ఆమె పేరు చిరస్థాయిగా మిగిలిపోతుంది. బాధాతప్తుల హృదయాలపై ఆమె ముద్ర చెరిగిపోనిది.

గాంధీ మహాత్ముని తర్వాత దీనజనుల బాధల గాథలను ఇంత దగ్గరగా దర్శించిన త్యాగమయి తిరిగి థెరిసాయే! స్వాతంత్ర్యానంతరం భారతచరిత్రలో ఇంత జనహృదయాల్లో ప్రతిష్టితమైన వ్యక్తి థెరిసాయేనేమో! ఆమె మరణంతో ప్రపంచం ఒక గొప్ప సంఘసేవికను, ఒక ఆధ్యాత్మిక నాయికను కోల్పోయింది. మన దేశం ఒక పెద్దదిక్కును కోల్పోయింది. ఆమె లేని కలకత్తా ఒక అనాథ! ఆమె లేని లోటు అమ్మలేని లోటు....అందుకే మానవాళికి అమ్మను చూడాలని వుంది.

# జన్మభూమి

భూమి అందాన్ని చూసి సంతోషిస్తున్న మనిషి, ఆ భూమికే తను హా
తలపెడుతున్నాననే సత్యాన్ని గుర్తించకపోవటం మాత్రం విషాదం. అసలు మని
తీరే అంత. "జన్మనిచ్చిన తల్లి గుండెల మీద ఆడుకోవడం మనిషికి అలవా
స్తన్యమిచ్చిన తల్లి గుండెల్లో గునపాలు గుచ్చటమూ మనిషి స్వభావమే! తన
జీవాన్ని అందించి, నిలిచేందుకు స్థానం యిచ్చిన భూమికి మనిషి స్వయం
వినాశకర్త అవుతున్నాడు. దాహం తీరుస్తున్న జలాల్లో శ్వాస నిలుపుతు
వాయువుల్లో మనిషి విషాన్ని చిమ్ముతున్నాడు. తన మరణశాసనం త
రాసుకుంటున్నాడు. ~~ఈ~~విషాదసత్యాన్ని గ్రహించి, మనిషి మారకపోతే ఇపుడెం
అందంగా కానవస్తున్న భూమి రేపు నిర్జనమవుతుంది. మిగిలిన గ్రహాల మాదిరి
సౌరకుటుంబంలో తనూ ఒకటిగా మిగులుతుంది."

మనిషి సాధించిన విజయాలు అనంతమని మనం గొప్ప
చెప్పుకుంటూ ఉంటాం - నిజమే! లెక్కకు అవి మిక్కిలిగానే వున్నాయి. భూ
బల్లపరుపుగా లేదని, అదో గోళమని కనిపెట్టాడు. సాగరాలను కనుగొన్నా
నక్షత్రాలు ఏమిటో అవి ఎందుకు రాత్రిళ్లే తళతళమంటూ మ
కనిపిస్తున్నాయో వివరించగలిగాడు. జీవావిర్భావ రహస్యాలను ఒక్కొక్క
విప్పిచెప్పాడు. భూగోళానికి ఆకర్షణశక్తి ఉందని గుర్తించాడు. అయినా ద
అధిగమించి రోదసీలోకి చేరి వ్యోమ విహారం చేశాడు. జీవనాన్ని మర
సుఖమయం చేసుకోవడానికి అనేకానేకమైన పరికరాలను, యంత్రా
సృష్టించాడు. వ్యక్తిగా తానొక్కడు సాధించలేనిది సమిష్టిగా మరెందరితోనో
మహాద్భుతాలు సృష్టించాడు. కళ్లు తెరచి చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చ
సాధనాలు సిద్ధం చేసుకున్నాడు.

భూగోళం అందాలు వర్ణనాతీతాలు, పచ్చదనం నిండిన అరణ్యాలూ, ఎదిరించి గెలవమని సవాలు విసిరే ఎడారులు, ఎత్తైన పర్వతాలు, అంతు తెలియని అగాధాలు, భూగోళం అంతటికి జీవజలం అందిస్తున్నట్టుండే నదులూ, నదాలు....వేటి అందం వాటిదే! మేఘాల రథాలతో పోటీ పడుతూ రెక్కలల్లారుస్తూ నింగిని ఎగిరే పక్షులది ఓ అందమైతే, నీలి సంద్రం నీడలో హాయిగా జలకాలాడే మత్స్యాలదో అందం! పించం విరిసిన మయూరిది ఓ సోయగమయితే, మెరపువేగంతో కదిలే లేడిపిల్లది మరోఅందం. భూగోళానికి యివన్నీ పెట్టని ఆభరణాలే, సౌరకుటుంబంలో మరే గ్రహానికి యింతటి వైవిధ్యం లేదు. జీవమున్న గ్రహం యిదొక్కటే, నీటిధారలున్న గ్రహం ఇదొక్కటే.

ప్రముఖ పర్యావరణం శాస్త్రజ్ఞుడు 'మాక్స్ నికోల్సన్' ఒకప్పుడు ఒక మాటన్నాడు. "చంద్రుడి మీద మనిషి కాలు పెట్టినమాట నిజమే. కానీ నాకు ఆ ఆనందం కన్నా భూగోళాన్ని మనిషి ఓ మురికివాడ చేస్తున్నాడనే విచారమే అధికంగా వుంటుంది" అని! ప్రతి మనిషినీ ఆత్మశోధనకు ప్రేరేపించవలసిన మాట అది! ప్రపంచాన్ని పరిశీలిస్తే అన్ని దేశాలలోనూ పర్యావరణ పరిస్థితులు దయనీయంగా ఉన్నాయని ఐక్యరాజ్య సమితి ఏనాడో పేర్కొంది. పర్యావరణ పరిస్థితులు క్రమక్రమంగా క్షీణించడానికి కారణాలు అనేకం. అభివృద్ధి చెందిన దేశాలలో కారణాలు ఒక తీరైతే, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆ కారణాలు మరోలా వుంటాయి.

భూగోళం మీద ఆలోచనాజ్ఞానంయున్న జీవి మనిషి ఒక్కడే, పర్యావరణం బాగున్నా, బాగుండక పోయినా దానికి కారణం, కర్త కూడా మనిషే! మరే జీవి భూమికి మనిషంత హాని చెయ్యలేదు. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఒక్కో విజయం సాధిస్తున్నకొద్దీ మనిషి ప్రకృతి వనరులపై దాడిని, దోపిడీని తీవ్రతరం చేస్తున్నాడు. జనాభా అధికం కావడం వల్ల నివాసయోగ్యమైన స్థలం కొరత పెరిగింది. మురికివాడలు ఎక్కువయినాయి.

వ్యర్థాల ఉత్పత్తి అధికమయింది. ఈ వ్యర్థాలను జలవనరులలో కలపడంతో అవి కలుషితమవుతున్నాయి. పారిశ్రామీకరణంతో వాయుకాలుష్యం మొదలై భూమి వాతావరణం బలహీనమవుతుంది. పెరిగే జనాభాకు తగిన ఆహారోత్పత్తి కోసం ఆనకట్టల నిర్మాణం పెరిగి, సస్యరక్షణ కోసం క్రిమి కీటక నాశను వాడకం ఎక్కువ కావడంవల్ల పర్యావరణం ప్రమాదాల పాలవుతున్నది. అడవుల నరికివేతతో సారవంతమైన భూమి తగ్గి, పలు ఫల పుష్పజాతులు అంతరిం దశ వచ్చేసింది. ఖనిజాల వేటలో మనిషి భూమి ఉపరితలాన్ని చీల్చి లోలోప పొరల్ని తలకిందులు చేస్తున్నాడు. సమతౌల్యాన్ని దెబ్బ తీస్తున్నాడు. ఇలా ప్ర చర్యతోనూ మనిషి పర్యావరణానికి హాని చేస్తూనే ఉన్నాడు. ఇదే విధానాన్ని ఇ పైనా కొనసాగిస్తే.....ముందున్నది ఊహకందని వైపరీత్యమేనని నిపుణు హెచ్చరిస్తున్నారు.

మనిషికి జీవం ఇచ్చింది పర్యావరణమే. జీవావిర్భావ క్రమంలోన జీవపరిణామ దశల్లోనూ మనిషికి రూపునిచ్చిందీ పర్యావరణమే - ఇప్పు మనిషి ప్రకృతిని శాసించే స్థితికి చేరుకున్నాడు. భూగోళం స్వరూ మార్చేందుకే ఒడిగడుతున్నారు.

భూగోళం పుట్టి 460 కోట్ల సంవత్సరాలయింది. ఇంత కాలం భూగోళం పొందిన మార్పులు అనేకం. ఉపరితలం మీద ఉష్ణోగ్రతలు వంద డిగ్రీలు సెంటిగ్రేడ్ నుంచి మైనస్ డిగ్రీలలోకి మారాయి. సముద్రా ఏర్పడ్డాయి. సరిహద్దులు మారాయి. ఒకనాటి సముద్ర ప్రాంతాలలో ఎత్తై పర్వతాలు ఆవిర్భవించాయి. యింతటి సంక్లిష్టతలోనూ జీవావిర్భావం జరిగి ప్రకృతికి తగిన రీతిలో మారుతున్న ప్రకృతి పరిస్థితులకు ధీటుగా మారగలి జీవులు మనగలుగుతూ వచ్చాయి.

మనిషి సాధించిన విజయాలు అనంతమే. కాదనే వీలులేదు. ఇ మనిషి వైఫల్యాలు దండిగానే వుంటున్నాయి. కారణాలు ఏవైతేనేం. త నివసించే భూగోళాన్నే కాపాడుకోలేని స్థితిలోకి వచ్చేశాడు మనిషి! తను తెలి

చేస్తున్న తప్పుల ఫలితంగా అనూహ్యమైన శిక్షను అనుభవించే దశకు చేరుతున్నాడు. ధరిత్రి దినోత్సవాలను ఏటా ఆనవాయితీగా జరుపుకోవటంతో సరిపెట్టుకోకుండా, ధరణిని కాపాడుకొనే యత్నాలు ముమ్మరం చేయకపోతే సమీప భవిష్యత్తులోనే భూగోళంమీద వాతావరణం తారుమారవవచ్చు. జలభూభాగాల మధ్య హద్దులు పోవచ్చు. అనంతమైన జలరాశులతో భూగోళం యావత్తు రంగులు మార్చుకొని జీవరాశి అంటూ ఏది వుండని నిర్జీవగోళంగానే కానరావచ్చు. ఆలసిస్తే ప్రాణాలకే ముప్పు కనుక నేడే మనం మన పుడమితల్లిని కాపాడుకొనేందుకు కదలటం మంచిది!!



# పేదరికం (గరీబీ హటావో)

మనిషికి ఉన్నంత చరిత్ర కలిగినది ప్రపంచంలో ఒక్కటే ఒక్కటి అదే పేదరికం. అన్నీ వున్నా వాటిని అందుకోలేని పేదరికం ఒకనాటి మానవుడిదయితే, ఉన్నవి తమకు అందుబాటులో లేకపోవడం ఈనాటి మానవుడి పేదరికం. అడపాదడపా చట్టసభల్లో పేదరికం చర్చనీయాంశమవుతూనే వుంటుంది. ప్రపంచంలోని అనేక స్వచ్ఛంద సంస్థలు పేదరికం స్వభావాన్ని ఏ దేశంలో ఎలా పొంచి వుందో, ఎలా పాతుకుపోయిందో ఎలా వికటాట్టహాసం చేస్తుందో గణాంక వివరాలతో సహా సేకరించి మానవజాతిని పీడిస్తున్న పేదరికం చరిత్రను వివరిస్తూ వుంటాయి. కమీషన్లు ప్రణాళికలు, పథకాలు, నినాదాలు, సిద్ధాంతాలు, చర్చలు, పేదరికాన్ని పారదోలడానికి విఫలయత్నం చేస్తూనేవున్నాయి. అయినా పేదరికం మాత్రం మానవజాతిని వెన్నంటి నడుస్తూ తన శతాబ్దాల కక్షను వీడడంలేదు. పేదరికం ప్రకృతి ప్రసాదం కాదు. సమాజం అందిస్తున్న వరమాల. వ్యవస్థ పన్నాగం. ఎన్నో ఏళ్లుగా పేదరికంపై సాగుతున్న పోరును వివరించే ప్రయత్నమిది.

ఏ ప్రభుత్వం కూడా ఇదీ పేదరికం అని చెప్పగల స్థితిలో లేదు పేదరికం అనేది ఒక సామూహిక నేరమై పోయింది. నానాటికీ అది వెర్రితలలు వేస్తుందేతప్ప దాన్ని శాశ్వతంగా అణచివేయగల సామర్థ్యం ఏ దేశానికీ, ఏ ప్రభుత్వానికీ లేకపోయింది. బాగా అభివృద్ధిచెందిన దేశాలుగా గుర్తింపు పొందిన దేశాల్లో కూడా పేదరికం తన ఉనికి కాపాడుకుంటూ వుంటుంది. ఆర్థిక వ్యవస్థలోని లొసుగులు చీటికి మాటికి చెలరేగుతున్న అంతఃస్సంఘర్షణలు,

యుద్ధాలు, పిడికిలి బిగించిన ఉగ్రవాదం, ప్రపంచ పరివ్యాప్తమైన బంచగొండితనం, స్వార్థపరత్వం, కరువులు, భూకంపాలు, వరదలువంటి ప్రకృతి బీభత్సాలు - ఇవన్నీ ప్రజల్ని అట్టడుగుకు తోస్తున్నాయి. దారిద్ర్యరేఖను దాటి రాలేని స్థితిలో కూరుకుపోయేలా చేస్తున్నాయి.

శ్రీ వి.యం. దండేకర్, శ్రీ నీలకంఠరథ్ అనే ఇద్దరు ప్రొఫెసర్లతో పేదరికాన్ని అధ్యయనం చేయడం ప్రారంభమయింది. వీరు 1971లో 'భారతదేశంలో పేదరికం'' అనే పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించారు. మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 'గరీబీ హటావో' అనే నినాదాన్ని కూడా అప్పుడే ప్రారంభించారు. ఇక అప్పట్నించే 'పేదరికం' ప్రధానాంశమయింది. దాన్ని వివిధ కోణాల్లో చర్చిస్తూ అధ్యయనం చేస్తూ అనేక సంస్థలు నివేదికలు ప్రచురించాయి.

పేదరికాన్ని గుర్తించడానికి జీవన ప్రమాణమే ముఖ్యమని ప్రొఫెసర్ లక్డావాలా వాదన. పోషక విలువలున్న ఆహారవినియోగాన్ని అనుసరించి పేదరికాన్ని అంచనా వేయడం సరికాదనీ, జీవనప్రమాణాన్ని కొలమానంగా తీసుకోవాలని ఆయన అంటారు. ప్రాంతాలవారీగా, వాతావరణాన్ననుసరించి ఆహారపు అలవాట్లు మారుతాయని, అందువల్ల ఆహారాన్ని అనుసరించికాక జీవన ప్రమాణాలను దృష్టిలో వుంచుకున్నప్పుడే పేదరికాన్ని అంచనా వేయటం సక్రమమవుతుందని ఆయన వాదన. పోషక విలువలున్న ఆహార వినియోగంతోపాటు, వస్తువినిమయాన్ని కూడా దృష్టిలో వుంచుకోవాల్సిన అవసరమయింది. ఈ రెండింటిని ఆధారంగా చేసుకొని వివరాల సేకరణ జరిపినప్పుడు సమగ్రమైన నివేదిక తయారవుతుంది. అప్పుడే పేదరికాన్నీ, దాని స్థాయినీ గుర్తించడానికి వీలు కలుగుతుంది.

పాతిక సంవత్సరాల క్రితమే పేదరికాన్ని గూర్చి చర్చించిన దేశంలో, దాన్ని నిర్మూలించడానికి చేపట్టిన చర్యల అమలులో ఏ మేరకు నిజాయితీ వుంది. నేటికి యిది ప్రశ్నార్థకమే తప్ప పేదరికాన్ని చిత్తశుద్ధితో రూపుమాపాలని

ప్రయత్నించడం జరగడం లేదు. అయితే సాంఘిక, ఆర్థిక అసమానతల్ని పోగొట్టినప్పుడు, పేదరికాన్ని రూపుమాపడం వీలవుతుందని మన ప్రణాళికల నిర్మాతలు విశ్వసించారు. ఆ మేరకు ప్రణాళికారచన చేశారు.

భూసంస్కరణలను అమలు పరచడం వల్ల గ్రామీణ ప్రజలకు భూమి సంక్రమిస్తుంది. దానిద్వారా వారికి ఆదాయం కూడా పెరిగి అభివృద్ధి చెందడానికి వీలవుతుంది. జనాభా పెరుగుదలని అరికట్టే పద్ధతులైన కుటుంబ నియంత్రణ వల్ల జనాభా పెరుగుదల నరికట్టడం సాధ్యమవుతుంది. అందువల్ల కుటుంబజనాభా తగ్గి తలసరి ఆదాయం పెరుగుతుంది. వివిధ ప్రణాళికల ద్వారా చిన్నతరహా పరిశ్రమలను, కుటుంబ పరిశ్రమలను స్థాపించి ప్రజల ఆర్థిక స్థితిని మెరుగుపరచడం, అందువల్ల ఉపాధి అవకాశాలు మెరుగవుతాయి. ఆదాయం పెరుగుతుంది.

పేదరికాన్ని నిర్మూలించే కార్యక్రమాల్లో భాగంగానే ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం. ట్రైసమ్, జవహర్ రోజ్‌గార్ యోజన వంటి పథకాలను అమలు పరుస్తున్నారు. అయితే వాటికి కేటాయించిన నిధులు ఏమై పోతున్నాయి! రెక్కలొచ్చి ఎగిరిపోతున్నాయి. లబ్దిదారులకు నిధులు అందడం లేదు. అన్ని స్థాయిల్లోనూ చోటు చేసుకున్న అధికార దుర్వినియోగం వల్ల నిధులు మధ్య దళారుల పరమై పోతున్నాయి. ఈ అక్రమాల్ని అడ్డుకోలేకపోతున్నారు. దివంగత ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ స్వయంగా అన్న మాటలను ఈ సందర్భంగా గుర్తు చేసుకోదగినవి. రూపాయిలో 15 పైసలు మాత్రమే లబ్దిదారుడికి అందుతున్నాయి. మిగిలిన 85 పైసల్ని, అధికారులు దళారులు కొల్లగొడుతున్నారు. నిజమే పేదరికాన్ని నిర్మూలించేందుక ఉద్దేశించిన పథకాలు యిలా దళారుల పరమైనప్పుడు అభివృద్ధి ఎల సాధ్యమవుతుంది. యిక ఇన్‌ఫ్లేషన్ మహమ్మారికి అదుపే లేదు. ధరల పెరుగుదలపై నియంత్రణ లేదు. సామాన్యుడి కష్టం నిత్యావసరాలన కొనుక్కోవడానికే చాలడం లేదు. యిక పోషక విలువలున్న ఆహారం కానీ

యితర వస్తువులపైగాని దృష్టి ఎలా సాగుతుంది? ప్రజల స్థితిగతుల్ని మెరుగుపరచేందు కుద్దేశించిన అనేక పథకాల లక్ష్యాన్నీ, నిర్వహణనీ కట్టుదిట్టం చేసి సరైనవిధంగా అమలుపరిచినప్పుడు, వాటి ద్వారా ఆశించిన ప్రయోజనం చేకూరుతుంది.

శుభం

# చదవండి

ఒక మంచి పుస్తకం చదవడమంటే మనసు మకిలితనాన్ని తుడిచేయడం. ఆలోచనల్లో తేటదనానికి ఆహ్వానం పలకడం - ప్రార్థన, యోగ వంటిదే పుస్తక పఠనం. సమస్త ప్రపంచాన్ని, చరిత్రను, నాగరికతను అక్షరాలుగా చదువుకోవడం మన అదృష్టం. ఈ రోజుల్లో కట్టలు కట్టలుగా వందల వేల సంఖ్యలో పుస్తకాలు మార్కెట్లోకి వచ్చిపడుతున్నాయి. వాటిలో మంచివి, చెడ్డవీ గుర్తించడం కష్టం. కొంతకాలం గడిస్తే చెత్తంతా కొట్టుకపోతుంది. చక్కటి పుస్తకమేదో తెలుస్తుంది. ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధి చెందిన మహాకావ్యాలను చదవడం మనకెంతో ఉపయోగకరం. ఆ పుస్తకాలు శతాబ్దాలుగా మనిషి ఆలోచనలను, జీవన విధానాలను, లిపిని ప్రభావితం చేస్తుంటాయి. ఈ కావ్యాలు... గొప్ప పుస్తకాలు చదవడం వల్ల మనకో ప్రయోజనం కూడా వుంది. ఆధునిక సాహిత్యంలో ఏది మంచిది. ఏది ఉపయుక్తమన్నది గ్రహించగలం. గొప్ప పుస్తకాలకు కాలదోషం పట్టదు. మనం ఒక మహాకావ్యం చదువుతున్నప్పుడు సరిగ్గా అన్వయించుకొని చూడాలి. నేటి కాలంలోని సమస్యలకు అందులో పరిష్కారాలు కనిపిస్తుంటాయి. మన ఆలోచనాధోరణి విస్తృతమయ్యే అవకాశం మరీ ఎక్కువగా వుంటుంది. గొప్ప పుస్తకాలతో పాటు ఆధునిక సాహిత్యాన్ని కూడా మనం చదవాలి. ఆ విధంగా కాకపోతే మనం మన కాలంలో మన చుట్టూ జరుగుతున్న మార్పులను అంతర్గత సంఘర్షణలను అర్థం చేసుకోలేము. "To practice the art of reading, deveop a hungry, curious, questioning mind and then seek your answers in books" అన్నారు స్వామి వివేకానంద.

పుస్తకాలు చదవడమన్నది పూర్తిగా వ్యక్తిగతమైన విషయం. ఒక వ్యక్తి అభిరుచి, దృక్పథంవంటి విషయాలపై పుస్తకాలు చదవడమన్నది ఆధారపడి వుంటుంది. తమను తాము ఒక పద్ధతిగా తీర్చిదిద్దుకునేందుకు, విజ్ఞానం కోసం,

వినోదం కోసం ఈ విధంగా చాలా చాలా ఉపయోగాల కోసం పుస్తకాలు చదవాలి. మనకు జీవితంమీద ఒక అవగాహనము కలిగించడంలోను వైవిధ్య భరితమైన జీవితంలో మనమెలా జీవించాలో తెలుసుకోవడంలోను పుస్తకాల పాత్ర ఎక్కువగా వుంటుంది.

మన వ్యక్తిగత అనుభవాల పరిధి తక్కువగాను, సంకుచితంగాను ఉంటుంది. వాటినే గనుక నమ్ముకుంటే మనం కూడా సంకుచిత స్వభావులుగా, అతి చిన్న పరిధిలోనే భ్రమిస్తూ ఉంటాం. ఐతే పుస్తక పఠనం మనకు లెక్కలేనంతమంది అనుభవాలను ఆలోచనలను తెలియజేస్తుంది. సాధారణంగా ఆయా రచయితల జీవిత చరిత్రలైతే అందులోని కథానాయకలు వారి వారి కాలాలలో అత్యంత మేధావులుగాను ప్రఖ్యాతి చెందినవారై వుంటారు. వారి అనుభవాలను, ఆలోచనలను చదవడం ద్వారా మనం మన సంకుచిత ధోరణుల నుంచి, ఇరుకు మార్గాల నుంచి బయటపడే అవకాశం లభిస్తుంది. The reading of good books is like a conversation with the finest men of past centuries అన్నారు ఒక ఫ్రెంచ్ తత్త్వవేత్త.

విద్యార్థులే పుస్తకాలు చదవాలన్న రూలేమి లేదు. మనిషికి ఆజన్మాంతం మంచి నేస్తంగా ఉండేది గొప్ప పుస్తకమే. పుస్తకపఠనం మానసిక సంస్కారాన్ని కలిగిస్తుంది. జీవితం గాఢతను, ప్రపంచం తీరుతెన్నులను నమ్మకంగా పరిచయం చేసేది మంచి పుస్తకమే. సమస్యల పట్ల సరియైన వివేచన, మానవ సంబంధాల పట్ల సరైన స్పందన అలవరిచేవి పుస్తకాలే. మన మీద మనకు నమ్మకాన్ని కలిగించేది, కాలానుగుణ మార్పులను పట్టిచూపి చైతన్యవంతంగా జీవితాన్ని శ్వాసించేలా చేసేది కూడా చక్కటి పుస్తక పఠనమే. మన మాటతీరును, సమాజంలో మన ప్రవర్తనను సవ్యదిశలో సాగేలా చేసేది పుస్తకముతో మన నేస్తమే!

"పుస్తకాలు నా మనస్సుకు, హృదయానికి రెక్కలిచ్చాయి. నేను బురద నుండి బయటపడడానికి ఎంతో తోడ్పడ్డాయి. పుస్తకాలు చదవకపోతే నాచుట్టూ వున్న మౌఢ్యంలోనూ, నీచంలోనూ మునిగిపోయి వుండేవాణ్ణి. విశాలమైన

ప్రపంచ దృశ్యాలను పుస్తకాలు నా ముందు పెట్టాయి" అన్నారు మాక్సింగోర్కీ. మనిషి జీవితంలో ప్రాధమిక అవసరాల తర్వాత స్థానం ఆక్రమించేది పుస్తకాలే. అంటే విద్యనే. బాల్యం నుంచి మనిషికి పుస్తకాలతో పరిచయం ఏర్పడుతుంది. ఆ క్రమంగా అతడు విద్యాశీలిగా మారుతాడు. పై చదువుల కొచ్చేసరికి ప్రపంచ సాహిత్యంలోని అపురూపమైన పుస్తకాలు అతనికి పాఠాలుగా మారుతాయి. పరీక్షలతో ముడిపడి మార్కుల కొలబద్దలు ఉండటంతో విదేశ రచయితల కవులతో పాటు కాళిదాసు, వాల్మీకి, వ్యాసుడు, చలం, శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి లాంటివారి రచనలు, ఇంకా ఇతర సబ్జెక్టులతో భావిజీవితానికి ఎంతో పనికి వచ్చే విషయాలు అన్నీ విసుగుగా మారుతాయి. లేదా పరీక్షల వరకే వాటితో పని అన్న భావన ఏర్పడుతుంది. పుస్తకాలను మనం చదవడం ఒక ఎత్తయితే, వాటిని సరైన రీతిలో మన జీవితాలకు, మన కాలానికి, మన చుట్టూ ప్రపంచానికి అన్వయించుకొని చూడటంలో మన 'విద్వత్తు' అవసరం ఎంతో వుంటుంది.

ప్రభుత్వ ఉద్యోగంలో చేరినవారు 'చదువు' వ్యాపకంతో మరింత పె ఉద్యోగిగా మారే అవకాశం వుంది. వ్యాపారం చేస్తున్నవారు ప్రాపంచి విషయాలు, జీవిత సత్యాలు తెలుసుకొని మరింత సృజనాత్మక ఆలోచనలు చేసే అవకాశముంది. మనిషి తుది శ్వాస వరకు విద్యార్థిని అనే భావన కలిగి జీవితమే స్వర్గతుల్యమవుతుంది. "The good book is the best friends, the same to-day and for ever " అన్నారు మార్టిన్ టిప్పర్ ఆ ఆంగ్లకవి.



# కరుగుతున్న వయస్సు

కాలం ఒక ప్రవాహం. ఆ ప్రవాహం వెంట మనిషి జీవితం కూడా కలగలిసిపోతుంది. బాల్యం, యవ్వనం తీయని జ్ఞాపకాలుగా మారిపోతాయి. వయస్సు కరిగిపోయే కొద్దీ మనిషి వృద్ధాప్యపు కౌగిట్లోకి జారిపోతాడు. కుటుంబసభ్యుల మధ్య నిర్వ్యాపకంగా ఒక శాపంగా భావించేవారు ఎందరో! ఆర్థిక దుస్థితి వల్ల, కుటుంబసభ్యుల అనాదరణ వల్ల అశాంతికి లోనై చరమ జీవితాన్ని విషాదంగా గడిపేవారు లెక్కకు మించి వున్నారు. చూసేవారు, సేవలు చేసేవారు కరువై అనాథలుగా మరణించేవారు వున్నారు. చరమ జీవితాన్ని వృద్ధుల శరణాలయాల్లో గడిపేవారూ వున్నారు. అలాంటి దుస్థితి అనుభవంలోకి రావడం వల్ల చాలామంది జీవితం పట్ల నిర్లిప్తతకు లోనవుతున్నారు.

మనిషి దైనందిన జీవితంలో కొత్తదనం ప్రవేశించినపుడు మానసిక వికాసం పెరుగుతుంది. రోజూ ఒకే దినచర్య వల్ల మూసపోసిన జీవిత విధానం వల్ల విసుగు, చిరాకు కలుగుతాయి. అందువల్ల చరమాంకంలో కూడా మానసిక ఉల్లాసాన్ని కలిగించే అభిరుచులపై ఆసక్తిని పెంచుకోవాలి. ఉద్యోగ విరమణ చేశాక తొలినాళ్లలో ప్రతివారికి విచారం కలుగుతుంది, దిగులు పెరుగుతుం అందుకే ప్రతివారు నిత్యజీవిత వృత్తుల నుంచీ, పదవీబాధ్యతల ను తప్పుకోగానే ఆ స్థానంలో కొత్త అభిరుచులకు చోటిచ్చి జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలి.

ఉద్యోగ విరమణ చేసినవారు అనేక మార్గాల వేపు తమ ఆలోచనల్ని మళ్ళించుకోవచ్చు. తమ తమ జీవితానుభవాలను గ్రంథస్తం చేసి ముందు తరాల వారికి మార్గదర్శకులు కావొచ్చు. పత్రికలలో కూడా వ్యాసాలు

రాయవచ్చు. వివిధ సంఘసేవా కార్యక్రమాలలో నిమగ్నులు కావచ్చు. కొన్ని అభివృద్ధి చెందిన దేశాలలో ఈ సంఘసేవ ద్వారా జరిగే శ్రమదానాన్ని కొన్ని మిలియన్ల రూపాయలుగా లెక్కగడతారు. ఇదంతా సాముదాయిక సంతోషానికి తోడ్పడుతుంది. ఏ ఏ రంగాలలో పని చేయాలి అనేది ఆయా వ్యక్తుల అభిరుచి, సామర్థ్యం బట్టి నిర్ణయించుకోవచ్చు. యిలా చేయడం వల్ల ఎంతో తృప్తి, ఆనందం లభిస్తాయి. కాలాన్ని ఆనందంగానూ, మనసుకి నచ్చిన రీతిగానూ వినియోగించుకునే తెలివితేటల్ని పెంపొందించుకోవాలి. మనల్ని చూసి మరికొందరు అదేబాటలో నడిచేలా ఆదర్శవంతంగా వ్యవహరించాలి. నేడు రకరకాల టి.వి ఛానల్స్ వచ్చాయి. గ్రంథపఠనంలోనూ, సృజనాత్మకమైన రంగాలలోనూ మనస్సును లగ్నం చేయవచ్చు. పేపర్లలో ఉద్రేకపరిచే వార్తలు వచ్చినప్పుడు మనస్సు ఆందోళనకు లోనుకావడం చాలామందికి అనుభవమే. కొన్ని కొన్ని సందర్భాలలో వృద్ధుల ఆరోగ్యాన్ని పరీక్షించే డాక్టర్లు "ఈ వార్తాపత్రికలు చదవడం తగ్గించండి" అంటూ సలహాలిస్తుంటారు. అలా చేస్తే కొన్ని రకాల మానసిక ఆందోళనలు మటుమాయం అవుతాయని నమ్మకం.

వృద్ధాప్యంతో పాటు పేదరికం కూడా తోడయితే పరిస్థితి చాలా దయనీయంగా వుంటుంది. మన దేశంలోని కొన్ని రాష్ట్రాలలో వృద్ధాప్యపు పెన్షన్ అంటూ కొంత డబ్బు యిస్తున్నారు. ప్రభుత్వం వారు యిచ్చే యీ వృద్ధాప్యపు పెన్షను ఏ మూలకు సరిపోకపోయినా ప్రభుత్వ ఆఫీసుల చుట్టూ తిరిగే వృద్ధులు ఎందరో వున్నారు.

నిజానికి వృద్ధులైన తల్లిదండ్రులను పోషించాల్సిన బాధ్యత వారి సంతానానికి వుంటుంది. మా పిల్లలు మమ్మల్ని చూడటం లేదు అని కోర్టెక్కి తమ హక్కులను సాధించుకోవాలని ఏ తల్లీదండ్రీ ప్రయత్నించరు.

వయస్సు మళ్లినవారిని వేధించే మరో ముఖ్యమైన సమస్య ఆరోగ్యసమస్య. వయస్సు పెరగడంతోపాటు ఆరోగ్యసమస్యలు అధికం కావడం సహజమైన పరిణామం. గుండెజబ్బులు, హైపర్‌టెన్షన్, కీళ్ళనొప్పులు, నేత్ర

సంబంధమైన వ్యాధులు - ఇవన్నీ కూడా నిత్య వైద్య పర్యవేక్షణ కోరేవే.

ఆర్థిక, ఆరోగ్య సమస్యలు లేకపోయినా, తమను చూసుకొనే సంతానం వున్నా కొంతమంది వృద్ధులు అసంతృప్తిగానే వుంటారు. వయస్సు మళ్లిన తల్లో తండ్రో ఏ కొడుకు యింట్లోనో, కూతురు యింట్లోనో వుంటున్నప్పుడు వారు అక్కడి పరిస్థితులకు అనుగుణంగా సర్దుకపోవాల్సి వుంటుంది. కాని కొంతమంది పెద్దవారు అలా చేయరు. అక్కడ కూడా అన్నీ తమ యిష్టప్రకారమే జరగాలంటారు. అనవసరంగా ప్రతి విషయంలో తలదూర్చి అడగని సలహాలిచ్చి ఆ సలహాలు పాటించలేదని కోపం తెచ్చుకుంటారు.

వయసు పెరిగినా స్వతంత్ర భావాలను అణచుకోలేని కొంతమంది పెద్దలు తమ బిడ్డల దగ్గర కూడా వుండలేక వేరే ఆశ్రయాలను కోరుకుంటూ వుంటారు. ఇలాంటి వారిని ఆదుకునేవే వృద్ధుల శరణాలయాలు - "ఓల్డ్ ఏజ్ హోమ్స్".

పండిపోయిన వారు పసిపిల్లల మనస్తత్వంలోకి వస్తారు. పెద్ద మనస్సుతో సరియైన సేవలు అందించాలి. కరుగుతున్న వయస్సును గౌరవించాలి.



# మత్తు

పొరపాటు అలవాటుగా మారితే పర్యవసానం ప్రమాదకరంగా వుంటుంది. తెలిసో తెలియకో, తెలిసిన వారి ప్రోత్సాహం వల్లనో, వ్యసనాల వలల్లో చిక్కుకుంటే భావిజీవితం బాధామయమవుతుంది. చదువుకునే వయస్సులో విద్యకన్నా వ్యసనాలకే ఎక్కువగా ప్రాధాన్యత యిచ్చి, మాదక ద్రవ్యాల మత్తులో మునిగిపోతూ లక్షలాది యువకులు ఉజ్వల భవిష్యత్తును చేతులారా నాశనం చేసుకుంటున్నారు. ప్రపంచంలో ఎక్కడ చూసినా రేపటి నవజీవనం కోసం జవజీవాలను అందించాల్సిన యువత వ్యసనాల ఊబిలో కూరుకుపోతూ జవాన్నీ జీవాన్నీ కోల్పోయి నిర్వేదంగా నిస్తేజంగా తయారవుతోంది. అమెరికాలోనూ, అర్జెంటీనాలోనూ, ఫ్రాన్సులోనూ, పాకిస్తాన్‌లోనూ, ఇండియాలోనూ, శ్రీలంకలోనూ ఏ దేశంలోనైనా డ్రగ్స్‌కు బానిసలైన వ్యధార్తజీవుల యదార్థగాథాచిత్రాలు దయనీయంగా, దుర్భరంగా మనకు దర్శనమిస్తాయి.

మత్తు గూర్చి గాంధీగారు ఏమన్నారంటే - తాగుడు వ్యసనాలలో ఒకటి, కోట్ల కొలది దరిద్రులూ వేలకొలదీ భాగ్యవంతులూ ఈ పిశాచానికి బలియై, ఐశ్వర్యం, ఆరోగ్యం, ఆనందం ఈ అన్నింటినీ కోల్పోయినారు. పాశ్చాత్య నాగరికతలో తాగుడు తప్పు కాదు. తాగి తందనాలు తొక్కడం తగని పని. కాని మన దేశంలో ఒక్కరు కూడా, తాగుడలవాటయిన వర్గాల వారు కూడా గౌరవం కలవారెవరూ దానిని బహిరంగంగా అంగీకరించరు. పురాణాలలో కొందరు మద్యం సేవించినట్లు తార్కాణాలు కనపడుతున్నా,

శుక్రాచార్యుల వంటివారు దానిని నిషేధించారు. "తాగుడుకలవాటు అయినవారు పాపాత్ములు" అన్నాడాయన.

ఆంధ్రదేశాన్ని ఉగ్రరూత లూగించి సారా నిషేధ ఉద్యమానికి పుట్టినిల్లైన దూబగుంట మనం మరచిపోలేం. తరతరాల మానవచరిత్రలో మాసిపోని కళంకంగా మిగిలి, కోట్లాది కాపురాల్ని కాల్చి బూడిద చేస్తున్న సారా రాక్షస శక్తిని మట్టుబెట్టే వరకూ విశ్రమించని శపథం పట్టారు వీర నారీమణులు.

మత్తుగా వుండడానికి - మద్యపాన వ్యసనం నేడు దేశమంతా ఆ మాటకొస్తే ప్రపంచమంతా ఓ ఫ్యాషనై పోయింది. చిన్నా పెద్ద, బీదాబిక్కీ తేడా లేకుండా అన్ని వర్గాలవారినీ చుట్టుముడుతోంది. తాగినవారి శరీరాల్నీ, వారి కుటుంబాల్నీ కూడా పూర్తిగా పీల్చి పిప్పి చేస్తున్నా ఈ మద్యపానం "తప్పు" అని మహిళలు ఇప్పుడు ఎలుగెత్తి చెప్తోంటే తప్ప నిజానికి దీన్నెవరూ ఇటీవలి వరకు తప్పుగానే భావించలేదు. ధనికుల ఇళ్లల్లో మద్యపానం ఓ దైనందిన చర్య. పెళ్లిళ్లు, పేరంటాలు, విందులు, వినోదాల సమయంలో "కాక్టైల్స్" ఓ సాధారణ విషయం. సాయంత్రం అయి ఆఫీసు ఒదిలితే చాలు యింటి దారి మర్చిపోయేవారు లేకపోలేదు.

కల్తీ కల్లు, నకిలీ సారా, ఫెనీ గుడుంబా, పలచ్...పేర్లు ఏమైనా కావచ్చు. ప్రదేశాలు ఏమైనా కావచ్చు. ప్రజల్ని మాత్రం నిలువునా శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా, ఆరోగ్యపరంగా దోచుకుంటున్నాయి. గంజాయి దమ్ము బిగించటం, భంగు తాగటం, హెరైన్ సేవించటం, కొకైన్ వాడటం వంటి మాదక ద్రవ్యాల వ్యసనాలకు ప్రపంచమంతా బానిసై పోతోంది. గత రెండు దశాబ్దాలలో డ్రగ్స్ ప్రపంచమంతా అల్లుకుపోయాయనీ, ఈ ఇరువై సంవత్సరాలుగా విశ్వవ్యాప్తంగా మాదక ద్రవ్యాల సేవనానికి అలవాటు పడినవారి సంఖ్య యిబ్బడి ముబ్బడిగా పెరిగిపోయిందని యునైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ నార్కోటిక్స్ కంట్రోల్ బోర్డువారు తమ వార్షిక నివేదికలో తెలియజేసారు.

మహాత్మాగాంధీ యంగ్ ఇండియాతో ఇలా అన్నారు - భారతదేశాని

కంతకూ నియంతగా ఒక గంటసేపు నేను నియమించబడితే, ముందుగా బ్రాందీ, సారా షాపులన్నింటినీ ఎట్టి పరిహారమివ్వకుండా మూయించివేస్తాను. గుజరాతులో వున్న కల్లు గీసే తాళ్లనన్నింటినీ నరికి వేయించివేస్తాను. ఫ్యాక్టరీలో పని చేసే కార్మికులందరికీ మానవమాత్రులకు తగిన పరిస్థితులను నెలకొల్పమని, సామాన్య పానీయాలు, ఫలహారాలు దొరికే శాలలను, ప్రమాదరహితమైన వినోద స్థలాలను నెలకొల్పమని ఫ్యాక్టరీ యాజమాన్యాన్ని నిర్బంధిస్తాను. డబ్బు లేదని యజమానులు సాకు పెడితే, అసలు ఫ్యాక్టరీల నన్నింటినీ మూసివేస్తాను. నేను నియంతగా వ్యవహరించిన గంట సేపూ నియంతననే మత్తులో పడను. గంజాయి సారా సేవించను. తాగుడు పనికిరాదనే వాదిస్తాను అన్నారు గాంధీజీ.

# భూమి మహత్తు

"జననీ జన్మభూమి స్వర్గాదపీ గరీయసీ". మనం జన్మించిన భూమి మనం ప్రేమించదగినది పూజించదగినది. భూగోళం నవగ్రహాలలో ఒకటి, సౌరకుటుంబంలోని పెద్ద గ్రహాలలో ఒకటి, సూర్యునికి దగ్గరగా వున్న బుధుడు, శుక్రుడు గ్రహాల మాదిరిగా కాకుండా భూమికి సంబంధించి యెంతో శాస్త్రీయ సమాచారం మనకు అందుబాటులో వుంది. భూమి కరుణిస్తే మన జీవితాలు వికసిస్తాయి. విప్లవిస్తే అగ్నిపర్వతాలు బద్దలై ప్రళయం సంభవిస్తుంది. భూకంపాలు బయల్దేరుతాయి. కట్టడాలు, గృహాలు, యితర నిర్మాణాలు నేలమట్టమవుతాయి. ప్రాణికోటి నశిస్తుంది. చెట్టుచేమలు విరిగిపడతాయి. ప్రపంచమే శ్మశానవాటికవుతుంది.

భూమి కరుణిస్తే ప్రకృతి సహకరిస్తుంది. పాడిపంటలు ధనధాన్యాలతో తులతూగుతాయి. మానవాళి జీవితం వసంతంతో వెల్లివిరుస్తుంది. ఎంతో మహత్తరమైనశక్తి మన భూమాతలో వుంది. అందుకే మనం జన్మభూమిని ప్రేమించాలి. మన జన్మాంతం పూజించాలి.

వెలయ భూమి తల్లి విత్తనమటు తండ్రి
పంటలయ సుతులు పాడి పరము
ధర్మము తనపాలి దైవము సిద్ధము
విశ్వదాభిరామ వినురవేమ.

భూమి తల్లిలాంటిదైతే బీజావాపనం చేసే వాడు తండ్రి. ఫలితంగా పుట్టిన పంటలు సంతానం. పాడిపై నుంచి వచ్చేది అంటే ఇతరమైంది. తాను పాటించే వ్యవసాయ ధర్మమే తనకు ఎదుట కనిపించే దేవుడు. ఆదినుంచి వ్యవసాయ సమాజములో భూమిని స్త్రీగా, తల్లిగా, ఆకాశాన్ని తండ్రిగా భావించే

ఆచారమున్నది. భూమి పంటలను కంటుంది. ఆకాశములోంచి వర్షాలు కురిపించి విత్తును మొలకెత్తిస్తాడు కాబట్టి ఆకాశం తండ్రి, పంటలే పిల్లలు. ఆ పంటలను తిని బ్రతికే మనం భూమి పిల్లలమే. వ్యవసాయము నేర్చినవారు గోసంస్కృతిని ఇతరంగా భావించేవారు భూమిని నమ్ముకున్నవారికి "కృషియే ధర్మం, ప్రత్యక్ష దైవం" అంటున్నాడు వేమన.

భూమి గ్రామాలను, పట్టణాలను, నగరాలను, ప్రదేశాలను, రాజ్యాలను, దేశాలను ఖండాలుగా రూపాంతరము పొంది - ప్రతిదశలో మానవులలో అధికారదాహాన్ని పెంచి పరిపాలనామైకం కమ్మించింది. రాజులు - సామంతులు - చక్రవర్తులు ఉద్భవించి, శౌర్యాలు పెంచుకున్నారు. రాజ్యకాంక్ష పెంచుకున్నారు. పరిణామం దాడులు, యుద్ధాలు బయల్దేరినాయి. అలెగ్జాండర్ ప్రపంచ విజేత కావాలని రవి అస్తమించని సామ్రాజ్యం స్థాపించాలని కోరుకున్నాడు. అలాంటి భూపరిపాలనా కాంక్షతోనే బ్రిటీషువారు భారతదేశాన్ని కైవసం చేసుకుని హక్కులను, అధికారాలను పొంది మనలను బానిసలను చేసి మన సర్వసంపదలను కొల్లగొట్టివారు భోగభాగ్యాలతో తులతూగినారు. యింతటి మహత్తరమైన ఈ భూమి మానవ చర్యలను భరిస్తుంది. ఆశీర్వదిస్తుంది. ఒక్కొక్కమారు ప్రళయరూపం ధరిస్తుంది.

రోజురోజుకు భూమిపై మక్కువ పెరుగుతూ వున్నది. ముక్కలు ముక్కలు హద్దులు ఏర్పరుచుకుంటున్నారు. నివాసస్థలాల పేరుతో కాలనీలు ఏర్పడుతున్నాయి. వ్యాపారస్తులు కాలనీల పేరుతో కోట్లు గడిస్తున్నారు. వ్యాపారసరళి పెరిగింది. భూమిని అమ్మడానికి అహర్నిశలు అన్నపానీయాలు లెక్కచేయకుండా ప్రచారాలు, ఎరలు, బహుమానాలు బహుముఖంగా అభివృద్ధి చెందుతూ మనుష్యులను ఏమార్చే పరిస్థితి యేర్పడింది.

సర్వసంపదలను కలిగిన భూమాత మనిషికి తన మహత్తరమైన శక్తిని అర్థం కాకుండా అహర్నిశలు అన్వేషణలో వుండునట్లు చేస్తున్నది. ఖనిజ సంపద కొరకు, పెట్రోలు యింధనముల కొరకు బంగారములాంటి విలువైన ఖనిజముల కొరకు మనిషి అన్వేషణలో వినూత్న ప్రయోగాలను అవలంబిస్తూ పరిశోధనలు చేస్తూనే వున్నాడు.

నదులు, జీవనదులు కలిగి ప్రాజెక్టుల నిర్మాణాలు యేర్పరుచుకుని భూమాతను పచ్చటి చీరలతో అలంకరించి మనిషి తన భవిష్యత్తును అహర్నిశలు పరీక్షించుకొంటున్నాడు. భూమిని కాపాడుకోవడం, ధరిత్రిని ప్రేమించడం మనిషి కర్తవ్యం. అందులో భాగంగానే పర్యావరణ పరిరక్షణకు కృషి సాగాలి. జననీ జన్మభూమి స్వర్గం కన్నా విలువైనది కదా!



# అహింస

యుగపరిస్థితులకు, మహాపురుషుల ఉపదేశాలకు సమన్వయం కుదిరినపుడు ఓ గొప్ప చైతన్యం సంభవిస్తుంది. గాంధీగారి పట్ల ఈ సూత్రం అక్షరాలా వర్తించింది. హింసను అహింసతోను, అసత్యాన్ని సత్యంతోను ఎదుర్కొనవలసిందని గాంధీగారు ఉద్బోధించారు. వారు నిరాయుధ పోరాటాన్ని నేర్పించారు. ఇది మన దేశసంస్కృతి యొక్క వికసిత రూపమే. బుద్ధ భగవానుడు, మహావీరుడు మున్నగువారు అనేకులు మనకు ఈ విషయాలే బోధించారు. గాంధీగారు ఈ విషయాలే బోధించినప్పటికీ వాటికి విప్లవాత్మకమైన అర్థం ఆపాదించబడింది.

నిరాయుధ ప్రతీకార విధానం - నిరాయుధ పోరాటం సాగించడానికి మార్గాలు అన్వేషించవలసిన చరిత్రాత్మకమైన అవసరం ఏర్పడింది. దాని ఫల స్వరూపంగా గాంధీగారు ఒక్కరే నిరాయుధ పోరాటాన్ని గురించి ఉద్బోధించి నట్లయితే, లక్షలమంది వారిని వ్యతిరేకించి వుండేవారు. మహాఅయితే నలుగురో, ఐదుగురో శిష్యులు లభించి వుండేవారు. కాని అది సమగ్ర దేశవాసుల అభిలాష. అక్కడక్కడ దీనిని అమలుజరపడము కూడా జరిగింది. ఆంగ్లేయులు మనల్ని నిరాయుధుల్ని చేయడం వలన ఒక విచిత్రమైన పరిస్థితి యేర్పడినది. ఆనాటి ప్రజల అభిలాషయే గాంధీగారి అహింసావిధానంగా రూపొందింది.

గాంధీజీ మనం వైరి భావం లేకుండానే శత్రువును ఎదిరిద్దాం అని అన్నారు. తద్వారా ప్రపంచానికొక గొప్ప సిద్ధాంతం లభించింది. దాంట్లో నిర్వైర భావం, ప్రతీకార ప్రవృత్తి రెండూ ఇమిడి వున్నాయి. దానివలన సమాజానికో మార్గం లభించింది. గాంధీగారు చూపించిన ఈ విధానం ముందు పెద్ద పెద్ద

ుయుధాలు వమ్మైపోయినవి. ఆంగ్లేయులు ఈ దేశంలో రాజ్యం చేయాలంటే, లాదిమంది, లక్షలాదిమంది ప్రజల సహకారం కావాలి. గాంధీగారు ఆ హకారాన్ని నిలిపివేయమని అన్నారు. అలా చేస్తే ఎంత శక్తివంతమైన ాజ్యమైనా కొనసాగదు. సహకరించకపోతే మనలను కొట్టవచ్చు. బాధలు ెట్టవచ్చు. చంపవచ్చు. అయినా మనం సహకరించం. "చస్తే చచ్చిపోతాం కానీ ు యిష్టానికి అనుకూలంగా పని చేయం" అనగల ఆత్మశక్తిని గాంధీజీ ంసాదించారు.

గాంధీ మాతృదేశ విమోచనం కోసం జన్మించిన మహనీయుడు. యము నుండి, కోరికల నుండి ముందే ఆయన విముక్తి పొందినాడు. ందూమతంలోని నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలు ఆయన జీవితంలో ూతన సంయోగమును పొందినవి. భక్తి, జ్ఞాన, కర్మలకు కేంద్రస్థానమైన ్యాగమే ఆయనకు మోక్షసాధనము. ఆయన మహర్షి. కొండలు, నదులు, ముద్రతీరాలు, అడవులూ కావు ఆయన తపోభూములు. జనసంకీర్ణమైన ంపంచంలో శౌచ, దాన, ధర్మ, దయా, క్షమాగుణాలతో జీవితం డిపేవారాయన.

చెడును జయించేటందుకు చేసే యుద్ధాలలో ఆయనకు సత్యం, ్యాహం - అహింసా సాధనము. కాబట్టి ఆయనకు సాధన ఫలితాలు రెండూ క్కటే. జయాపజయాలు సమాన సుఖదుఃఖముల భేదాలే. ఆయన ప్రజల ుత్మలను విజృంభింపజేసారు. ఆయన సహచరులు ఆయన సిద్ధాంతాలను ్యవిశ్వాసంతో గ్రహించి జనసామాన్యమునకు లౌకిక హేతువాదముతో ంచారం చేసారు. ఈ విధంగానే సత్యాహింసలపైన ఆధారపడిన నూతన త్యాగ్రహ కార్యక్రమాన్ని ఆయన సాగించగలిగారు.

గాంధీగారి అహింస ఒక మార్గం. అంతేగాని గమ్యస్థానం కాదు. హింస ఒక దృక్పథం అంతేకాని సిద్ధి కాదు. సత్యాగ్రహంలో వెలుతురే గా ుకటి వుండదు. అసత్యం వుండదు. సత్యమే వుంటుంది. కసికి స్థానం లేదు

క్షమాగుణమే వుంటుంది. గాంధీ నేస్తున్న భారత జాతీయతా వస్త్రమునకు యివి పడుగు, రాజకీయాలు పేక. "ఇకముందు రాజకీయమును సాహసక్రియగా భావించకూడదు. అది ఒక మతం, ఒక తత్త్వశాస్త్రం. ఒక భౌతిక శాస్త్రం. ఒక శిల్పం. ఒక పూజాపద్ధతి. ఒక సేవా విధానం" అని భావించేవారాయన. ఆయనలో ఉత్తమ మానవ లక్షణాలెక్కువగా కన్పిస్తాయి. ఆయన క్రియాశూరులు, బుద్ధిశాలి, హాస్యవినోద చతురులు, ఋజువర్తనులు, సర్వతోముఖ ప్రజ్ఞాశాలి, పూర్ణపురుషులు - పునరుద్భవించిన బుద్ధుడు. గాంధీ మృతి చెందినా గాంధీజం శాశ్వతంగా వుంటుంది. గాంధీగారు యంగ్ ఇండియాలో ఈ విధంగా అన్నారు.

భారతదేశానికి అహింసా విధానం తూచినటుల సరిపోతుంది. సామాన్యప్రజలు తరతరాల నుండి అహింసా పద్ధతులు అవలంబిస్తున్నారు. భారతదేశంలో మానవత్వం బాగా వికసించింది. అందువలన హింసావిధానము కంటే అహింసా విధానం ఎక్కువ సహజంగా భారతదేశంలో ప్రకాశిస్తుంది.

భారతీయులు దుర్బలులని అహింసను అవలంబించమనటం లేదు. వారి శక్తిసామర్థ్యాలను దృష్టిలో వుంచుకునే అహింస వారికి ఆచరణ యోగ్యమంటున్నాను. శారీరకబలం కంటే ఆత్మబలం ఎక్కువ అంటున్నాను.

అహింసను నలుబది సంవత్సరాల నుండీ ఆచరించుచున్నాను. ప్రతీకారాన్ని తలపెట్టకూడదనుకున్నాను. ప్రతీకారశక్తి కలిగివుండి కూడా నేను అనేకసార్లు నిగ్రహించకోగలిగాను. నావలెనే ప్రవర్తించమని మిత్రులకు సలహా యిచ్చాను. జొరాస్టర్, మహావీరుడు, దానియేలు, ఏసుక్రీస్తు, మహ్మద్, నానక్ మొదలగు అనేకమంది ప్రపంచ ప్రవక్తల ప్రభోదములను పఠియించి నా జీవితాన్ని అహింసా సిద్ధాంత ప్రచారానికి అంకితం చేశాను.

హింసావిధానం వల్ల చేకూరిన స్వాతంత్ర్యం వెన్నుమెత్తిన రాతి వంటిది. దాస్యమే స్వాతంత్ర్య రూపం దాల్చి ప్రత్యక్షమవుతుంది. భారతదేశం హింసావిధానాన్ని అవలంబిస్తే భారతదేశ స్వాతంత్ర్యంతో నేను ఎట్టి సంబంధం పెట్టుకోను అన్నారు.

సత్యాహింసలు రెండూ నా ఊపిరితిత్తులు. ఇవి లేనిచో నేను ఒయసేపు కూడా జీవించలేను అన్నారు గాంధీజీ. అహింస ముందు నమానం నిలువలేదు. అహింస, పిరికితనం ఈ రెండూ పరస్పర విరుద్ధాలు. హింస ఉత్తమోత్తమైన సద్గుణం.

పిరికితనం నీచాతినీచమైన దుర్గుణం. ప్రేమ నుండి అహింస ద్భవిస్తుంది. విద్వేషం నుండి పిరికితనం పుడుతుంది. అహింస బాధలు నాస్తుంది. పిరికితనం బాధలు పెడుతుంది. అహింస నీతినియమాలను నగొట్టదు. పిరికితనం నీతికి విరుద్ధంగా నడుస్తుంది.

సంపూర్ణ అహింస అత్యుత్తమమైన వీరుని లక్షణం అన్నారు గాంధీజీ.

# సిద్ధాంతము-వికాసము-ఆచరణ

ఎరుకమాలు వాడు ఏమేమి చదివిన
చదివినంత సేపు సద్గుణియగు
కదిసి తామదండు కప్ప గూర్చునట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

గమ్యమెరుగక, దిక్కూతెన్ను దృష్టిలో లేక జీవితానికి అన్వయించుకోక చదివే చదువు ఎరుకమాలిన చదువు. అటువంటివాడు ఏది చదివినా, ఎంత చదివినా చదివినంతసేపే. గుటకలు మింగుతూ సొంతం అర్థమైనట్టు ప్రకాశిస్తాడు. వాడి మానసిక జాడ్యాలకు ఆ చదువు గుణమిచ్చినట్లు కనిపిస్తాడు. రోగానికి మందు పని చేయడం గుణమివ్వటం అంటారు. గుణం పొందినవాడు గుణి. ఆ చదువు ప్రభావం వదిలిపోగానే వెనకటిలాగే మిగుల్తాడు. తామరపువ్వులో కూచున్న కప్ప అందంగానే కనిపిస్తుంది. మళ్లీ నీళ్లలోకి గంతేసిన మరుక్షణం నుంచి తామర తామరే కప్ప కప్పే.

లోతుకు దిగి పరిశీలించనివాడు ప్రతిదానికీ ప్రభావితుడౌతాడు. కాని ఆ ప్రభావము తాత్కాలికమే. అసలు తత్త్వం తెలుసుకున్నవాడి వ్యక్తిత్వాన్ని ఏ ప్రభావమైనా మరింత పరిపుష్టం చేస్తుంది.

ఉత్తమమైన పనులు చేస్తూ వుండే మన కార్యకర్తలు సిద్ధాంతాల గురించి చాలా తక్కువగా అధ్యయనం చేస్తారని గాంధీగారు అనేవారు. మనలో అధ్యయనం పట్ల ఆసక్తి తక్కువ. కర్మ ప్రధానమైనది. చాలా సమయం పనులలోనే గడిచిపోతుంది. మన పనులు నిరంతరం జరిగేవే. వాటితోపాటు మనం సిద్ధాంతాలను కూడా అధ్యయనం చేస్తుండాలి. కేవలం పని చేసుకుంటూ పోతుంటేనే లాభం. పని అభివృద్ధి చెందుతున్నకొద్దీ, మూల సిద్ధాంతాలలో

'డా వికాసం కలుగుతున్నదా లేదా అని మనం గమనించాలి. అప్పుడప్పుడు
్యంలోని అంతరాత్మ అంటే మూలభావం సంకుచితం అయిపోతూ వుంటే,
హ్యాకారం వృద్ధి చెందుతూ వుంటుంది. కనుక ఆంతరికమైన తత్త్వం
్రుతమై ఉండాలన్న ధ్యాస ఉండాలి. దాంతోపాటు చింతన కూడా వుండాలి.
సిద్ధాంతాల మీద మనం నిర్వహిస్తున్న కార్యక్రమం ఆధారపడి ఉన్నదో, ఆ
ద్ధాంతాలే ఆ కార్యక్రమానికి ఆత్మతత్త్వం వంటివి. ఈ ఆత్మ తత్త్వం రోజూ
సిస్తూ ఉండాలి.

ఈ విధంగా సిద్ధాంతాలను గురించి గంభీరంగా అధ్యయనం చేస్తూ
ండకపోతే, మన కార్యక్రమం నిర్జీవం అయిపోగలదు. ఆ సిద్ధాంతాల మీద
ధారపడిన సంస్థలు ఎంత గొప్పవిగా కనిపించినా, ప్రాణం లేని శరీరం వలె
ష్ప్రయోజనకరం కాగలవు. సంస్థలు నిష్ప్రాణ దేహాలుగా ఎట్లా మారుతాయన్న
శ్నకు ఎన్నో ఉదాహరణలు గోచరిస్తాయి.

ఉత్సాహము నశించి పోవడమనేది కాలక్రమేణ జరిగే విషయమా?
న్న ప్రశ్న ఉదయిస్తుంది. వేగాన్ని, స్ఫూర్తిని నశింపచేసే సామర్థ్యం కాలానికి
న్నదనడంలో ఎలాంటి సందేహము లేదు. కనుకనే నిరంతరం కార్యక్రమానికి
త్సాహం కలిగిస్తూ వుండాలి. అప్పుడప్పుడు చైతన్యస్పర్శ కలుగుతుంటేనే
ని ప్రోత్సాహం కలగదు. గడియారానికి కూడా ప్రతిరోజూ 'కీ' ఇస్తూ
ండవలసిందే కదా! కాలక్రమేణ స్ఫూర్తి నశించడం నిజమే కాని ఉత్సాహాన్ని
శ్తిజపరచడం మానుకోకూడదు.

మన కార్యక్రమాల బరువు పెరుగుతున్నది కానీ అసలు తత్త్వం
ంచిపోతున్నది. వ్యక్తి ఎల్లకాలం ఉండడు కాని సంస్థ ఉంటుంది.

నేడు ఎన్నో విశ్వవిద్యాలయాలు శతజయంతులు జరుపుకుంటు
ాయి. శంకరాచార్యుడు మఠాలు స్థాపించి పన్నెండు వందల సంవత్సరాలు
ంచాయి. పూర్వకాలంలో ఈ మఠాల వల్ల ప్రజలలో కలిగేటంత చైతన్యం
ప కలగటంలేదు. అయినా ఇన్ని శతాబ్దాలు గడచినా, అవి ఏవో కొంత పని

చేస్తూవున్నాయి. ఈనాటికీ కొంతమందికి వాటిపట్ల అపారమైన శ్రద్ధ వుంది. అంటే ఆ సంస్థను స్థిరంగాను, చిరంజీవిగాను ఉంచే ఏదో ఒక శక్తి ఉందన్నమాట. ఆ శక్తి ఎలాంటిది అనే విషయం మనం ఎప్పుడూ మననం చేసుకోవాలి.

*చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు*
*కొంచెమైన నదియు కొదువగాదు*
*విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?*
*విశ్వదాభిరామ వినురవేమ.*

మహాత్ముల ప్రబోధాలు చైతన్యగోళాలై జ్వలించటానికి 'వారి' వ్యక్తిత్వంలో రెండు అంతఃశక్తులున్నాయి. ఆ సద్గుణాలు చిత్తశుద్ధి, సాహసం, చిత్తశుద్ధి వారి తత్వానికి ఊపిరి. నలుగురికి ఉపయోగపడే పని చేయడమే పుణ్యం. ఇతరులను పీడించటం పాపం. కాని ఎంత చిన్న మేలైనా హృదయపూర్వకంగా చేస్తే అది అనల్పమే. చాలా చిన్నదైనా పుచ్చులేని, సారవంతమైన విత్తనంలోంచేకదా ఆకాశమంత వృక్షం పుట్టేది.

ఔఔ

# "మానవధర్మం"

చీమ కుట్టెనేని చివుకు మనిపించును
చీమ యెంత దాని జీవమెంత?
చీమ వంటివారి సృష్టిలో నెరుగరా
విశ్వదాభిరామ వినురవేమ.

చీమ చిన్నదనీ, దాని ప్రాణమెంతటిది అని అనుకోకు. నలుసంత ఆ మ కుడితే ఆ మంటకు ప్రాణం చివుకుమంటుంది. ఆ చీమలాంటి ానవులు సృష్టిలో ఉన్నారు. తెలుసుకో అంటున్నారు వేమన. ఆకారాన్ని చూసి ువ కట్టకు. ఆ మనిషి సంస్కృతీ, శక్తీ ముఖ్యం. చీమలు చిన్నవే కాని చీమల ోకం చిన్నది కాదు. చీమల జీవన వ్యవస్థ మనుష్య వ్యవస్థకు మించినట్టిది. మల్లో రాజు, రాణి, శ్రామికవర్గాలు అని మూడు రకాలు వుంటాయి. కాని ాజు గొప్ప ఏమిలేదు. అవసరాన్ని, పనిని బట్టి విలువకాని అదనపు గొప్పలు మల్లో ఉండవు. చీమలు ఇతర కాలాల్లో శ్రమించి ఆహారం నిలువ చేసుకొని ర్షాకాలంలో కూచొని తింటాయి.

చీమల శక్తి కూడా చిన్నది కాదు. ఒక చీమ తన బరువు కంటే యాభై ండు రెట్లు బరువును మోస్తుంది. సుమతికారుడు చెప్పినట్లు "బలవంతమైన ర్పము చలిచీమల చేత చిక్కిచస్తుంది". గాలిలో ప్రాణవాయువు కొంతకాలం ేకున్నా చీమలు బ్రతుకుతాయని శాస్త్రజ్ఞులు అంటారు. చీమల్లా అల్పంగా నబడేవారి సృష్టిని మొదలంటా పరిశీలించమంటాడు వేమన.

నేటియుగంలో ఎవరైనా ఒక యజమాని తన సేవకున్ని చక్కగా ోషించి, వాడికి కడుపు నిండా తిండి, కట్టుకోవడానికి బట్ట ఇచ్చినా, మన

మనస్సుకు తృప్తి కలగదు. తిండి తిని, బట్ట కట్టి సుఖంగా వున్నా, పూర్ణవికాసం ఎట్లా సాధ్యం అవుతుంది అన్న ప్రశ్న ఉదయిస్తుంది. భర్త తన భార్యను చక్కగా చూస్తాడు. ఉత్తమంగా వ్యవహరిస్తాడు. భార్య కూడా ఆయన అడుగులకు మడుగులొత్తుతూ ఉంటుంది. అంతమాత్రాన ఇద్దరూ పూర్ణవికాసం పొందారని చెప్పలేము. యజమాని సేవకుడుగాను, సేవకుడు యజమానిగాను, భర్త భార్యగాను, భార్య భర్తగాను మారాలి. అంటే ఒకరిలోనే రెండు భాగాలు ఏర్పడాలి. అప్పుడే పూర్ణవికాసము సంభమవుతుంది.

గాంధీగారి జీవిత సిద్ధాంతం ఇదే. ఇది పూర్తిగా క్రొత్త దృక్పథము. దీని ఫలితంగా ఉత్తమోత్తమమైన ప్రాచీన సామాజిక విధానము మనకు నచ్చటం లేదు. పురాణకాలంలో గల చాతుర్వర్ణ విధానం ఆనాటికి తగింది కాని నేటి పరిస్థితులకు ఏమాత్రం అనుగుణంగా వుండదు. ప్రతికులంలో కూడా ఇతర కులాలకు చెందిన ఉదాత్త గుణాలు వుండాలి. అప్పుడే శాంతి, జ్ఞానము, తేజస్సు, శౌర్యము, కార్యకుశలత, వినయము, సేవావృత్తి ఇవి ప్రతి వ్యక్తిలోను చోటు చేసుకుంటాయి. అప్పుడే మానవుడు మానవునిగా పరిపూర్ణముగా అభివృద్ధి చెందగలుగుతాడు.

మనమంతా భగవంతుని అంశాలమే. ఒకరు గొప్పవారు కాదు. మరొకరు కొద్దీ కాదు. కనుక ఎవరూ ఎవరిమీదా అధికారము చలాయించనూ కూడదు. ఒకరి అధికారమును అంగీకరించనూ కూడదు. ఒక కుటుంబ సభ్యులవలె సంఘంలో మెలగాలి. ఈ జన్మలోనే భగవంతున్ని పొందాలి. పరమేశ్వరుడంటే సంపూర్ణత్వం. ఈ సంపూర్ణత్వాన్ని పొందాలి. సంఘాన్ని పోషించాలి. కనుక మన అందరి జీవితాలు సమర్పితము కావాలి. ఈ భావంతో పని చేస్తేనే గాంధీగారి పేరు నిలబెట్టినవారమవుతారు. వారి సమస్త కార్యకలాపంలో గల ఆంతరిక తత్త్వము ఇదే. ఆ భావాన్ని గ్రహించి నేటి పరిస్థితులకు అనుగుణంగా దాన్ని వికసింపచేయాలి.

సమస్త దేశమందు ప్రతి బాలుడు కూడా అనుసరించ గలిగేటువంటి

ఒక జాతీయ ఉపాసనావిధానం ఉండాలని బాపూజీ అన్నారు. ఐకమత్యాన్ని వృద్ధి చేసే ఉపాసనావిధానం ఒకటి కావాలి. దేశానికై నేను ఏదో కొంత సహాయం చేస్తున్నానన్న భావం ప్రతివారికి కలగాలి.

గాంధీగారు ఎప్పుడూ ఒక మీరా భజన పాడుతూ వుండేవారట. దాని అర్థం ఏమిటంటటే "బలహీనమైన దారంతో భగవంతుడు నన్ను బంధించాడు. ఆ దారంతో ఆయన నన్ను తనవైపు లాగుకుంటున్నాడు. నేను లాగబడుతున్నాను". బలహీనమైనదయినా ప్రేమపాశంతో నన్ను ప్రపంచాన్ని దగ్గరకు లాక్కోవచ్చు. మనం కూడా లాగబడుతాం. ఆ ప్రభావానికి లోనవుతాం. రాట్నంలో ఈ భావమే ఇమిడి ఉన్నది.

# అంతరాత్మ

ఈ చరాచర జగత్తులో ఎన్నో జీవులు పుడుతూ వున్నాయి, కాలగర్భంలో కలిసిపోతూ వున్నాయి. కానీ మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మేధస్సు కలిగిన మానవుడు తన శక్తితో మహోన్నతుడు, మహాత్ముడు కావచ్చు లేక మూర్ఖుడు, క్రూరుడు కావచ్చు. యిందుకు కారణం సత్ప్రవర్తన, సచ్ఛీలత, అంతరాత్మ ఆచరణ ముఖ్యం.

అంతరాత్మ ఎప్పుడూ ప్రబోధిస్తూనే వుంటుంది. ఈ ప్రబోధమే ఉత్తమోత్తమమైన ప్రబోధం అంటారు మహాత్మాగాంధీజీ.

ఈ ప్రబోధాన్ని ఒక్కొక్కసారి మనం తప్పక శిరసావహించవలసి వస్తుంది. దానివలన అనేక త్యాగాలు చేయవలసి వస్తుంది. బొటబొట కన్నీరు పెట్టవలసి వస్తుంది. ప్రియాతి ప్రియమైన దారాపుత్రులను బంధువులను విడనాడవలసి వస్తుంది. ప్రాణప్రదంగా చూచుకునే వాటికి దూరం కావలసి వస్తుంది. ఇటుల ప్రవర్తించడం మన జీవిత ధర్మం.

అంతరాత్మ ప్రబోధం అధిక సంఖ్యాకుల అభిప్రాయంలో ఏకీభవించనక్కర లేదు. ప్రపంచంలోని న్యాయస్థానాల నన్నిటినీ మించిన న్యాయస్థానం ఒకటి ఉంది. ఈ న్యాయస్థానంలో అంతరాత్మ విచారణ జరుపుతుంది. ఈ న్యాయస్థానం తదితర న్యాయస్థానాల నన్నింటిని అధిగమిస్తుంది.

మానవ ప్రబోధం ఒకటి. అంతరాత్మిక ప్రబోధం మరొకటి, అంతరాత్మిక ప్రబోధం దశదిశలకూ వ్యాపించి, నిలబడి ధ్వనిస్తూనే ఉంటుంది.

ఈ ప్రపంచంలో ఒకే ఒక నిరంకుశ పరిపాలన కలదు. అదే అంతరాత్మిక పరిపాలన, ఈ పరిపాలనకు నేను పరవశుడనౌతను అన్నారు గాంధీజీ.

ఒక విలేఖరి గాంధీగారికి ఒక లేఖ వ్రాశాడట. అందులో "అంతరాత్మ ప్రబోధం అంతరాత్మ ప్రబోధం అంటూ మీరు ప్రవచిస్తూ వుంటారు. ఇది ఎంత చేటు తెస్తుందో మీరు గమనించటం లేదు. అంతరాత్మ అనే రక్షణ పదాన్ని వాడి అనేకమంది పిల్లలు, పెద్దలు ఎన్నో అసంబద్ధ ప్రసంగాలు, అపభ్రంశ ప్రవర్తనలు జరుపుచున్నారు. పోనుపోను వీరి వ్యవహారం ముదిరిపోతున్నది. యువకులకు తలతిరుగుడు హెచ్చిపోతుంది. వయోజనుల అవినీతి పెచ్చు పెరిగిపోతోంది. ఈ దురాగతాన్ని మీరు ఆపలేరా? ఆపలేకపోతే, ఆ పదాన్ని ఇకమీదట వాడకండి బాబూ! అంతట ఈ పదం దొంగలకు ఆశ్రయమివ్వటం కట్టబడుతుంది. బాబూ! ఎవరికి ఎవరికి ఈ అంతరాత్మ ఉంది చెప్పండి? ప్రతివాడికీ అంతరాత్మ ఉంటుందాండీ? ఎలుకలను వేటాడే పిల్లులకు అంతరాత్మ ఉంటుందాండీ?".

ఈ విలేఖరి చేసిన నేరారోపణను నేను అంగీకరించక తప్పదు. అయితే అతడా సమస్యకుండే చెడు లక్షణాలనే గమనించాడు.

ప్రతి సద్గుణాన్ని దుర్మార్గులు దుర్గుణంగా మారుస్తారు. అందుచేత మనం సద్గుణానికే స్వస్తి చెపుతామా? సద్గుణాన్ని దుర్గుణంగా మార్చకుండా కొన్ని కట్టుబాట్లు చేయగలం.

ప్రజలు తమంతట తాము ఆలోచించుకోలేరు. ప్రతీదీ వారికోసం క్రమబద్ధం చేయబడింది. ఇట్టి పరిస్థితిలో వ్యక్తి లేక వ్యక్తులు చేసే ప్రయత్నాలు ప్రజాభిప్రాయానికి వ్యతిరేకం కావచ్చు. లేక శాసనాలకు వ్యతిరేకం కావచ్చు. శాసనం ప్రజాభిప్రాయానికి పర్యాయపదం.

హక్కులను నిలబెట్టుకునేందుకు వ్యక్తులు ఇలా ప్రజాభిప్రాయాన్ని తిరస్కరిస్తే, అంతరాత్మ ప్రబోధానుగుణంగా ప్రవర్తించిన వారయ్యేదరు.

విలేఖరి వ్రాసినటుల యువకులు అంతరాత్మ ప్రబోధం తమకు

కలదని నటించరాదు. ఈ ప్రబోధం ఎంతో శ్రమిస్తేగాని వినిపించదు. తలతిరుగుడుతనం అంతరాత్మ ప్రబోధమనిపించుకోదు. పిల్లలకు అంతరాత్మ ప్రబోధం ఉండదు.

విలేఖరి పేర్కొన్న పిల్లి అంతరాత్మ ప్రబోధానుగుణంగా ఎలకలను వేటాడదు. ఎలుకను చంపమని పిల్లి యొక్క ప్రకృతి ప్రేరేపిస్తుంది.

బాధ్యతారహితంగా ప్రవర్తించే యువకులు వారి జన్మలో దేనికీ ఎవరికీ విధేయులుగా నుండరు. వీరికి అంతరాత్మ ప్రబోధం ఉండదు. ఇలా ప్రవర్తించే వయోజనులకూ అంతరాత్మ ప్రబోధం ఉండదు. ఆటవికులకూ అంతరాత్మ ఉండదు.

మృదు మధుర హృదయంలో అంతరాత్మ నివసిస్తుంది.

కాబట్టి వ్యక్తిగత అంతరాత్మ అని, సామూహపు అంతరాత్మ అని వుండవు. ప్రతిదానిని అంతరాత్మకు అంటగట్టే వ్యక్తికి అసలు అంతరాత్మ అంటే ఏమిటో తెలియదు.

అంతరాత్మ మనలను పిరికిపందలను చేస్తుందనటంలో అర్థం లేకపోలేదు. అంతరాత్మ ఉన్న వ్యక్తి పూర్వాపరాలను విచారిస్తాడు. పట్టుదలలకు పోడు. అవిధేయుడుగా నుండడు. గందరగోళం చేయడు. సంధికి సిద్ధంగా ఉంటాడు. చెప్పింది సావధాన చిత్తంతో వింటాడు. చేసిన తప్పు అంగీకరిస్తాడు.

ఏది ఎట్ల వున్నా ప్రజాజీవితంలో అంతరాత్మ ప్రవేశం మంచిదే. ఏ కొద్దిమందికో అంతరాత్మ యొక్క స్వరూపం తెలిస్తే చాలు.

మానవ హక్కులకు, గౌరవ మర్యాదలకు ఎన్ని చిక్కులు వచ్చినా, ఈ కొద్దిమందీ గుండె నిబ్బరంతో పోరాడగలరు. వీరి చరిత్ర శాశ్వతంగా సువర్ణాక్షరాలతో చిత్రింపబడగలదు.

ఇక మాయోపాయాలతో జీవించే వ్యక్తుల చరిత్ర సబ్బు బుడగల వంటిది. ఏ నిమిషమందైన విచ్చిపోగలదు.

నేను ఎట్టి పోషకులను ఆశించను. నేను ఎవరికీ పోషకుడను కాను.

నేను స్వాతంత్ర్యాన్ని అభిలషించే జీవిని. అందువలన మీ స్వాతంత్ర్యానికి నేను ఏ విధంగానూ అడ్డురాను. నా అంతరాత్మ ప్రబోధాన్ని నేను భక్తిశ్రద్ధలతో ఆచరిస్తాను. నా దృష్టిలో అంతరాత్మ భగవానునకు పర్యాయపదం అనేవారు గాంధీజీ.

ప్రజాసేవను అంతరాత్మ మెచ్చుకోవాలి. ప్రజామెప్పుదలకు ప్రాకులాడే ప్రజాసేవకుడు చుక్కానిలేని పడవవంటివాడు.

ప్రజాసేవకు ఫలితం ప్రజాసేవే. ఇది ఉత్తమ సేవ యొక్క ప్రధానలక్ష్యం అన్నారు గాంధీజీ.

ఓం

# క్రమశిక్షణ

మనమేదైనా గొప్ప కార్యాన్ని, శాశ్వతమైనదానిని సాధించాలంటే నిర్దుష్టమైన క్రమశిక్షణకు లోబడాలి. నిర్దుష్టమైన క్రమశిక్షణ కత్తిమీద సాములాంటిది. ఇట్టి క్రమశిక్షణ వాదప్రతివాదాలతో అలవడదు. పాండిత్య ప్రకర్షకు రాదు. కారణకార్యాలను వెదికితే కనిపించదు. తర్కవితర్కాలతో క్రమశిక్షణను పొందలేము.

పెద్ద ఆపదలో క్రమశిక్షణను పొందగలము అన్నారు మహాత్మాగాంధీ.

క్రమశిక్షణ దృష్ట్యా గొప్పవారూ, కొద్దివారనే తేడాలు ఉండవు. ఆయా విధుల నిర్వహణకుగాను రాజు ఒక నౌకరును నియమించాడనుకోండి. తాను నియమించినది నౌకరైనా విధినిర్వహణలో రాజు ఆ నౌకరును ధిక్కరించి ప్రవర్తించడు.

స్వార్థత్యాగం, క్రమశిక్షణ, ఆత్మనిగ్రహం లేనిచో మనకు మోక్షం లేదు. ఏ ఆశా వుండదు.

క్రమశిక్షణ లేని స్వార్థత్యాగం నిరుపయోగం. నిజమైన సైనికుడు వాదోపవాదాలకు దిగడు. జయాన్ని పొందగలనా, లేదా అని ఆలోచించడు. సేనాని ఆజ్ఞ ప్రకారం ముందుకు సాగిపోతాడు. తన విధి తాను సక్రమంగా నిర్వహిస్తే ఏదోవిధంగా తప్పక జయం సిద్ధిస్తుందని విశ్వసిస్తాడు. ఈ సైనికుని ఆదర్శంగా తీసుకొని మనమందరం సంచరించాలి.

భవిష్యత్తును గూర్చి తెలుసుకునే శక్తి మనకెవరికీ లేదు. కానీ ఎవరి విధిని వారు సక్రమంగా నిర్వహించుకోవాలని మనందరికీ తెలుసు. మనకు తెలిసినది సాధ్యమైనది సక్రమంగా నిర్వహించాలి.

మన జాతికి క్రమశిక్షణ లేదని ఇతరులు వ్రేలు పెట్టి చూపునటుల ానం ప్రవర్తించరాదని గాంధీజీ బోధించారు.

క్రమశిక్షణ లేనివారికి ఆపదలు తప్పవు.

కాదు కూడదని నిర్బంధించి మనకు ఎవరూ క్రమశిక్షణ నేర్పలేరు.

ఉప్పెన గాలికి కోటగోడలు, బురుజాలు, వరదలకు కరకట్టలు ఎట్లాగో, ారాజకానికి క్రమశిక్షణ అలాంటిది.

సభ్యులను సమర్థతతో అదుపులో పెట్టలేని ఏ సంస్థను మన్నుటానికి ులులేదు. సర్వసేనాని ప్రధానకార్యాలయంలో వుంటాడు. అయా సేనలు ఆయా వ్యూహంలో నడవాలని ఆజ్ఞాపిస్తాడు. ఈ ఆదేశం జయాన్ని అంత తేలికగా సాధించలేదు అనుకుని సేనలు మరోరీతిగా సంచరించడం మంచిదంటారా? సర్వసేనాని ఆదేశాన్ని ధిక్కరించి సేనలు మరోరీతిగా సంచరిస్తే అపజయం తప్పదు.

సన్నద్ధులుకాని సైనికులతో, సంశయించే సేనలతో సర్వసేనాని యుద్ధం చేయడానికి ప్రయత్నించాడనుకోండి. అతనిని పరాజయం వరిస్తుంది.

ఇచ్ఛ అనేది వుంటే ఎంతటి కఠినమైన ఆదేశాలనైనా తేలికగా ఆచరించగలం అని బోధించారు గాంధీజీ.

కొంతమంది నాకు ఇలా వ్రాస్తున్నారు. వాలోగాని, రాట్నంలో గాని, వారికి విశ్వాసం లేదంటున్నారు. కాని క్రమశిక్షణ ననుసరించి రాట్నాన్ని చేపట్టమంటున్నాను అంటూ గాంధీజీ ఇలా అన్నారు "వీరి భాష నాకు బోధపడడం లేదు".

తనయందు విశ్వాసం లేదని తెలునుకొని, విశ్వాసరహితులైన సైనికులను వెంట నిడుకుని ఏ సేనాని అయినా వారి శక్తి నాధారం చేసుకుని యుద్ధరంగంలోకి చొరబడతాడా?

ప్రజలందరూ కలిసిచేసే ఈ చేతలలో ఈ లేఖరులకు విశ్వాసం కలదని, ఆ చేతలకు రాట్నానికి మధ్య నాకు కనిపించే సంబంధంలో వారికి విశ్వాసం లేదని వారి వ్రాతలు తెలుపుతూ వున్నాయి.

ప్రజలు నన్ను విశ్వసిస్తున్నారని వారికి తెలుసు. ఈ విశ్వాసానికి కొన్ని సిద్ధాంతాలున్నాయి. ఈ సిద్ధాంతాలలో నాకు నమ్మకం వుంది. కాని వీరు మాత్రం నమ్మడం లేదు. నాకు ప్రజలందరిలో వుండే పలుకుబడిని వారు అవకాశంగా తీసుకోవాలనుకుంటున్నారు. రాట్నంలో వారికి నమ్మకం లేదు. వారి దృష్టిలో రాట్నం రాట్నమని నేను మొండిపట్టు పడుతున్నాను. ఈ పట్టుదలకు నా అవివేకం కారణమని భావించినా వారికిష్టం లేకపోయినా ప్రజలలో పలుకుబడి కోసం వారు రాట్నాన్ని ఆరాధిస్తున్నట్లు సువిధతమౌవుతుంది అన్నారు గాంధీజీ.

దీనిని నేను క్రమశిక్షణ అనను. ఆదేశాలు హేతువాదానికి ఆగకపోయినా క్రమశిక్షణ వాటిని ఆచరణలో పెట్టునటుల చేస్తుంది అంటారు మహాత్ములు.

సేనాని యోగ్యతాయోగ్యతలను సైనికుడు ముందుగా ఆలోచించుకోవాలి. మంచివాడని నిర్ణయించుకునే సైనికుడిగా చేరాలి. సైనికుడిగా చేరిన పిమ్మట ఆదేశాల మంచి చెడులను ఆలోచించకూడదు. కాలాన్ని, శక్తిని ఆలోచనకు వృథా చేయకూడదు. సేనాని జారీ చేసిన ఆదేశాలను వెంటనే ఆచరణలో పెట్టాలి. అది దేనికి ఇది దేనికి అని మీనమేషాలు లెక్కిస్తూ కూర్చోకూడదు.

స్వచ్ఛంద సేవకులకు ఈ ఉపమానం బాగా వర్తిస్తుందని సంపూర్ణ విశ్వాసంతో బోధించారు గాంధీజీ.



# సంఘసేవ

సంఘసేవకు వ్రతపాలన అవసరమని బాపూజీయే సెలవిచ్చారు. ూర్వులు ఆత్యాత్మిక ఔన్నత్యానికి మాత్రమే నియమాలు అవసరమని ుకొనేవారు. ఆత్యాత్మిక వికాసానికి సాధన చేసే యోగులు, సాధకులు ుదలయినవారు ఆ నియమాలను పాటిస్తూ ఉండేవారు. సంఘసేవకులకు ుమాలు అవసరమనీ, అవి లోపిస్తే సేవకు బదులు అసేవ జరుగవచ్చునని ంధీగారు మొదటిసారిగా చెప్పారు. సత్యము, స్వరాజ్యము ఈ రెండింటిలో దొ ఒకదానిని కోరుకోవలసివస్తే నేను స్వరాజ్యాన్ని వదిలి సత్యాన్నే స్వీకరిస్తానని ాడా అన్నారు. స్వరాజ్యం పట్ల తీవ్రమయిన ఆకాంక్ష ఉన్న రోజుల్లో వారీమాట న్నారు. వారు సత్యం ద్వారానే స్వరాజ్యం లభిస్తుందని ఘంటాపథంగా ప్పారు. అదేవారి అద్వితీయమైన ప్రతిభ. వ్యక్తిగత సేవ ంరించి వేమన ఈ విధంగా అన్నారు.

ఎంత సేవ చేసి ఏ పాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోటి పొందు పదివేలకైనను
విశ్వదాభిరామ వినురవేమ.

సంఘసేవ చేసేవారి సంస్థలు అనేకంగా ఉన్నాయి. వారంతా ఏదో ఒక రూపంలో సంఘసేవ చేస్తూనే ఉన్నారు. సేవాకార్యం చేయడానికి ఏవో కొన్ని గుణాలు ఉన్నాయని అందరూ ఒప్పుకున్నా, నేటివరకు ఎవరూ దేశసేవకు సత్యం, అహింస, బ్రహ్మచర్యం మొదలగునవి అవసరమని చెప్పలేదు. ఎవరైతే ఈ వ్రతాలు వ్యక్తిగతరంగంలో, ధ్యానయోగంలో, వ్యక్తిగత వికాసానికి

అవసరమని అన్నారో, వారెవరు సేవ పేరు ఎత్తలేదు. ఈ సిద్ధాంతాలు ఆధారంగా మానవసమాజ నవనిర్మాణానికి వారెవరు నడుము కట్టలేదు. ఈ సిద్ధాంతాలు ఆధారంగా సాంఘిక విప్లవం ప్రారంభించవచ్చునని కూడా వారెవరు అనలేదు. సంఘసేవ, రాజనీతి, నిర్మాణాత్మక కార్యక్రమం, లోకసంఘటన, లోకశిక్షణ మొదలయిన బాహ్య కార్యక్రమాలతో పాటు సత్యం, అహింస మొదలయినవి అత్యవసరమని మొట్టమొదటిసారిగా చెప్పే సాహసం చేసినవారు గాంధీగారు. సత్యం, అహింస మొదలయినవి పునాదిరాళ్ళ వంటివి. వాటిని ఆధారంగా చేసుకొనే సంఘాన్ని ఉన్నత స్థితికి తీసుకపోవచ్చును. సంఘసేవకు అవి అనివార్యాలు. ప్రజాసేవకు అవి గీటురాళ్ళవంటివి. సాంఘిక, రాజకీయ సమస్యల పరిష్కారానికి ఆత్మశక్తిని ఉపయోగించవచ్చునని చెప్పడమే గాంధీగారి విశిష్టత అని చెప్పవచ్చును. వ్యక్తిగతంగా ఆత్మబలం విజయం పొందుతున్న విషయం సమాజానికి ఇదివరకే తెలుసు. సాంఘికంగాను, అతివ్యాపకంగాను ఆత్మశక్తిని ఈవిధంగా విజయవంతంగా ఉపయోగించ వచ్చునని గాంధీగారు చెప్పారు.

విజ్ఞాన శాస్త్రప్రయోగాలు ఒక ప్రయోగశాలలో జరుపబడినట్లు సత్యము లేక మరేదైనా గుణం మొదట ఒక వ్యక్తిలో ప్రకటితమవుతుంది. వ్యక్తి జీవితము ఒక ప్రయోగశాలవంటిది. ప్రయోగశాలలో ప్రయోగము సఫలమయినపుడే దానిని సంఘంలో పెద్ద పరిమాణంలో చలామణి చేయవచ్చును. ఒక వ్యక్తిలో ఒక గుణవికాస ప్రయోగం విజయవంత మయినపుడే దానిని సంఘంలో చలామణి చేయవలెను.

స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్ర దీపమునకు చీకటి చెడనట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

"అనుభవమే శాస్త్రము" - మాటలే మంత్రాలు అనేది సామెత,

సంశయం మిగలని స్పష్టత రావాలంటే, సత్యం వెలగాలంటే అనుభవం కావాలి. శాస్త్రజ్ఞానంవల్ల తెలిపిన సంగతులు స్వానుభవం వల్లకాని అర్థంకావు. శాస్త్రం ఇది చేయాలి, ఇది చెయ్యొద్దు అని చెప్తుంది. దానిని గుడ్డిగా అనుసరించి లాభంలేదు. సాధనా, అనుభవంలోంచి రావాలి. దానితో మూల కారణం తెలియాలి. అనుభవాన్ని ఆశ్రయించక, శాస్త్రాల మీద ఆధారపడటం వెలుతురు కోసం చిత్రించిన దీపం ముందు పెట్టుకోవటం లాంటిది. చిత్రదీపం అంటే కాగితంపై గాని పటంలో గాని చిత్రించబడ్డ దీపరూపం అన్నమాట. అట్లాంటి దీపం చిత్రదీపమే గాని సత్యమైన దీపం కాదన్నాడు వేమన. శాస్త్రవాసనలు అంటే శాస్త్రం వల్ల సంపాదించిన పరిజ్ఞానం. అనుభవాన్ని నమ్ముకో, అసలు సత్యం తెలుసుకో అని వేమన్న వాదన.

భారతీయ సంస్కృతిలో నిహితమైయున్న శక్తిని దైనందిన వ్యవహారాలలో ప్రకటింపజేసే అవకాశం గాంధీగారికి లభించింది. వారు స్వరాజ్యప్రాప్తికి సంబంధించిన పనులకు కూడా మానవసేవారూపాన్ని కల్పించారు. రాజకీయాలకు కూడా వారు మతపరమైన, ఆధ్యాత్మ పరమైన రూపాన్నిచ్చారు. అందుచేత వారు నడిపించిన ఉద్యమం కేవలం రాజకీయ ఉద్యమమే కాకుండా సమస్త జీవిత విధానాన్నే ప్రభావితం చేసింది. వారు నడిపించిన ఉద్యమంలో రాజకీయాలకు సంబంధం లేనివారు ఎంతోమంది పాల్గొన్నారు. స్వయంగా బాపూజీ కూడా రాజకీయాల మనిషి కారు. అయితే జీవితాంతంవరకూ వారు రాజకీయ విషయాలలో పాల్గొనక తప్పలేదు. అది వారి జీవితంలోని వ్యాపకసాధనలో, సత్యాన్వేషణలో ఒక భాగం మాత్రమే. రాజకీయాలలో సత్యానికి స్థానం లేదని అనేవారిని గాంధీగారు తీవ్రంగా ఖండించారు. పారమార్థిక సాధనకు సత్యనిష్ఠ అవసరమైనట్లు, ప్రాపంచిక వ్యవహారాలలో గూడ సత్యనిష్ఠ అవసరమని గాంధీగారు ఉద్ఘాటించారు. జీవితంలో రెండురూపాలు లేక రెండు భాగాలు ఉండటానికి వీలులేదు. కనుకనే వారు మొదటినుండి సత్యనిష్ఠ ఆధారంగా తమ సేవాకార్యం చేస్తూ ముందుకు సాగిపోయారు.

# చిత్తశుద్ధి

ఆత్మశుద్ధి లేని ఆచారమదియేల?
భాండశుద్ధి లేని పాకమేల?
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా!
విశ్వదాభిరామ వినురవేమ.

ఆడంబరముగా చేసుకునే అనేకాచారాలకు ఆత్మశుద్ధి అవసరము. శుచి శుభ్రత అవసరము. అందుకే ఉత్తమ పాకం కావాలంటే భాండం పరిశుద్ధమై ఉండాలి. చిత్తం పరిశుద్ధం కాకుండా చేసే శివపూజలు మిక్కిలి దండుగ అంటారు వేమన. దీనికి మూలం మన పూర్వఋషులు ప్రవచించిన త్రికరణ శుద్ధి, వాచామనసా, కర్మణా శుద్ధియే త్రికరణ శుద్ధి. కానీ ఈనాడు మనసులో ఆలోచించేది ఒకటి. బయటికి చెప్పేదొకటి, మది చేసేది మరొకటి. ఇది మన అనుభవంలో ఉన్నదే కానీ త్రికరణశుద్ధిగా నడుచుకునేవారు లేరని చెప్పలేము.

ప్రతి మనిషికి చిత్తశుద్ధితోబాటు సర్వోదయభావం అవసరము. దానిని అమలులో పెట్టడానికి మనం కొద్దో గొప్పో ప్రయత్నము మాత్రం చేయగలం. దానిని సంపూర్ణంగా అమలుపర్చగలగడం అసాధ్యం. సర్వోదయాన్ని పూర్తిగా అమలులో పెట్టాలంటే సర్వేశ్వరుని దర్శనం కలగాలిసిందే. "నా సంపూర్ణ జీవితసాధన, సత్యాగ్రహం మొదలయినవన్నీ పరమేశ్వరుణ్ణి వెదకే సాధనాల"ని స్వయంగా బాపూజీయే అన్నారు. సాధారణంగా ఈశ్వర్ సాక్షాత్కారం కోరేవారు ఏకాంతప్రదేశంలోకి వెళ్లిపోతారు. కానీ బాపూ ఏకాంతవాసం చేయలేదు. ప్రజల మధ్య ఉండే వారు పనిచేశారు. అయితే ప్రార్థన, ధ్యానం మొదలయిన వాటిలో **15-20** నిమిషాలు గడిపేవారు. కాని మన పనులలోనే ప్రతి క్షణం ధ్యానం ఉండాలని, ప్రజల మధ్య పని చేస్తూనే ఏకాంతాన్ని అనుభవించగలిగి ఉండాలని

వారు అంటుండేవారు. ఏకాంతవాసంలోకి వెళితే మన మనసు పరిపరివిధాల పోతుంది. అప్పుడు దాన్నెలా ఏకాంతం అనగలం? మన మనస్సు నుండి వేరు కాగలగడమే మనోవాంఛలను నిర్జించగలగడమే. నిజమైన ఏకాంతం ఆవిధంగా బాపూజీ ప్రజాసేవలోనే ఆంతాన్ని అనుభవించగలిగేవారు. "ఈశ్వరాన్వేషణకే, ఈశ్వర దర్శనానికే నా జీవితం అంకితం" అని వారెప్పుడూ అంటుండేవారు. "శరీరం ప్రపంచ వ్యవహారములో మనస్సు ఈశ్వరాన్వేషణలో".

ఈశ్వరదర్శనానికి అర్థం ఏమిటి? ఈశ్వరాన్వేషణ ఎలా సంభవమవుతుంది? భగవంతుడు గుణాత్మకుడు, సత్యము, ప్రేమ, కరుణ మొదలయిన మంగళప్రద గుణాల పరిపూర్ణత్వమే భగవంతుడు. ఆయన వేర్వేరు అంశాలు, రూపాలు, ఒక్కొక్క మనిషిలో ప్రకటితమవుతూ ఉంటాయి. ఈ ప్రకారమే సర్వేసర్వత్రా భగవంతుని గుణాలను దర్శించాలి. ఈ విధంగా భగవంతుని అంశాలను దర్శించగా దర్శించగా, గుణగ్రహణం చేయగా చేయగా మన హృదయం గుణభాండాగారం కాగలదు. అప్పుడే భగవంతుని పరిపూర్ణదర్శనం కాగలదు.

మనం చేసే దానాలు, సేవలు, త్యాగాలు, సత్యాగ్రహాలు మొదలయినవి అన్నీకూడా భగవంతుని అవ్యక్త శక్తిని దర్శించడం కోసం చేసే పనులే సత్యాగ్రహమప్పుడు మనం సుఖదుఃఖాలను సహిస్తూ ఎదుటివానిలో ఉన్న మంచిని బహిర్గతం చెయ్యటానికి కృషి చేస్తాం. ఈ గుణదర్శనం మీదనే సత్యాగ్రహం ఆధారపడివున్నది. ఈ గుణదర్శనంమీద శ్రద్ధ ఉండటం వలననే దానం చేయడం జరుగుతుంది. ఈ గుణదర్శనం జరిగితే ఈశ్వరదర్శనం కాగలదు. సంపూర్ణదర్శనం ఒక్కసారిగా సంభవంకాదు. ఈరోజు ఒక అంశం దర్శనమిస్తే మరోరోజు మరోఅంశం దర్శనమిస్తుంది. ఈ శరీరమున్నన్నాళ్లు ప్రయత్నం జరుగుతూ ఉంటుంది. అందుచేతనే బాపూజీ 'నా అన్వేషణ సాగుతూనే ఉన్నద'ని అంటుండేవారు. ఈవిధంగా చూస్తే బాపూజీ చేసిన ప్రతిపని వెనుక ఆధ్యాత్మిక భావం కనబడగలదు.

సమస్త భారతదేశం మీద వారి అధికారం చలామణి అవుతూ ఉండేది. కాని ఈ అధికారము కేవలం నైతికము మాత్రమే. ప్రతి దేశములో ఏదో ఒక విశిష్ఠ లక్షణం ఉంటుంది. మహాపురుషుల సత్తాను అంగీకరించడమే మన దేశంలోగల విశిష్ఠ లక్షణం. రాజులు, మహరాజులు, సేనాపతులు, షావుకార్లంటే ప్రజలు ఎప్పుడో ఒకప్పుడు భయపడుతూ వుంటారు. అయినా ప్రజలు ఏనాడూ వారి చెప్పుచేతలలో ఉండలేదు. ప్రజలకు వారి పేర్లు కూడా జ్ఞాపకంలేవు. ప్రజల హృదయాలపై వారు తమ అధికారాన్ని చలాయించ లేకపోయారు. సామాన్య భారతీయుని హృదయాన్ని ప్రభావితం చేయగలిగిన వారు ఒక్క మహాపురుషులే. ఈ దేశప్రజలు శంకరుణ్ణి, బుద్ధుడిని, నానక్‌ను, కబీర్‌ను ఇంకా ఇటువంటి మహాపురుషుల్ని జ్ఞాపకం ఉంచుకుంటారు కానీ అశోకుణ్ణి, అక్బర్‌ను గుర్తుంచుకోరు. గాంధీగారు వచ్చారు, ప్రజలు వారి మాటలకు తలఒగ్గడానికి ఏమిటి కారణం? గాంధీగారి స్వభావం మహాపురుషుల వంటిదనిపించింది. వారి పనులకు ఆధ్యాత్మ భావమే మూలం. కనుక ప్రజలు వారి మాటలను శిరసావహించారు.

గాంధీగారిని అర్థం చేసుకోవాలంటే వివరించిన విషయాలనన్నీ గుర్తుంచుకోవాలి. లేకపోతే పైపై విషయాలలో పడి గాంధీగారి నిజస్వరూపాన్ని చూడలేము. ఎప్పుడూ ఏపని చేసినా హృదయ పారిశుద్ధము అవసరమని గాంధీగారు ఎప్పుడూ చెబుతూ వుండేవారు. ఏ పని చేస్తున్నా హృదయశుద్ధి, చిత్తశుద్ధి కావాలి.

మేఘ మడ్డమైన మిహిరుని చెరుచును
చిత్తమడ్డమైన స్థిరము చెరచు
మరపు లడ్డమైన మరి ముక్తి జెరచును
విశ్వదాభిరామ వినురవేమ.

ముసిరిన మబ్బులు సూర్యకాంతిని అడ్డుతాయి. వ్యామోహం జనిస్తే స్థైర్యం చెడుతుంది. చైతన్యరహితమైన జడస్థితి వచ్చినవాడికి బయటపడే మార్గం తెలియదు. సత్య సాక్షాత్కారస్థితి ముక్తి, చిత్త స్థైర్యమున్న వాడికే అది అనుభూతమవుతుంది. సత్యచైతన్యం సూర్యుని వంటిది. వాటిని అజ్ఞానం, చాపల్యం కప్పివేయకుండా చూసుకొమ్మని హెచ్చరిస్తున్నాడు వేమన.

# నైతిక విలువల పరిరక్షణలో....

# కవుల, రచయితల బాధ్యత

సృష్టిలోని ప్రాణకోటిలో మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మానవుడు మేధోసంపన్నుడు. మేధస్సును మధించి ఆలోచనలను పంచగల శక్తివంతుడు. మేధస్సే ఉన్నత శిఖరాలను అధిరోహింపజేస్తుందన్న నగ్నసత్యాన్ని మనం సాదృశ్యంగా చూస్తూ వున్నాం. మేధోమధనంలో ఉత్పన్నమైన ఆలోచనలను పొందుపరచే వారే కవులు, రచయితలు, కళాకారులు మేధో(శమ జీవులు. శాస్త్రీయ పరిజ్ఞానాన్ని ఔపాసన పట్టి, నైతిక బాధ్యత వహించి సమాజ శ్రేయస్సును కోరి రచన చేసెడివారు ఎల్లవేళల పూజింపబడుతారు.

నేడు సృష్టి రహస్యాలు, ప్రపంచ చరిత్ర అనేక రహస్యాలు, విషయ పరిజ్ఞానాన్ని సులభంగా పొందుతున్నామంటే రచయితలే కారణం. వాస్తవాలను, ఊహలను శాస్త్రీయంగా మనకందించిన గొప్ప రచయితలు ఈనాటికీ ఆరాధ్యులు.

సురులు, భూసురులు, చక్రవర్తులు, రాజులు, పండితులను, కవులను, కళాకారులను ప్రత్యేకంగా పోషించెడివారు. వారిలోని మేధోసంపత్తిని బయటికి లాగెడివారు. మనం గత చరిత్రను ఒకసారి సంస్మరిస్తే వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ, మహాభారత గ్రంథాలు, నీతిశాస్త్రాలు మొదలగు సమాజ శ్రేయస్సే ధ్యేయంగా వెలువడిన అనేక గ్రంథాలు మేధోమధనంలో పుట్టిన ఉత్కృష్ట గ్రంథాలే. అందుకే ఆ రచయితలు, పండితులు ఇప్పటికీ ఎప్పటికీ పూజితులు.

నేడు సమాజాన్ని ఉత్తేజపరిచే శక్తి, ఉరకలు వేయించే శక్తి, స్పందించే

శక్తి, శాసించే శక్తి, అనేక విప్లవాలను రేకెత్తించే శక్తి, సామాజిక స్పృహవున్న ప్రపంచభాషల వల్ల ప్రభావితమవుతున్న అభ్యుదయ కవుల, రచయితల మేధస్సుల్లో అంకురించే ఆయుధంగా వుంది. ఈ పదునైన ఆయుధం మంచికి ఉపయోగించి మహత్తరమైన ఫలితాలను పొందవచ్చు. చెడు తలంపు చేస్తే భస్మమై మట్టిలో, నీటిలో, వాయువులో కలిసిపోవచ్చు. కాబట్టి నైతిక బాధ్యత చాలా గొప్పది.

మానవమేధస్సు అణుబాంబును సృష్టించింది. అంతరిక్షంలోకి వెళ్లింది. విప్లవాలకు నాయకత్వం వహిస్తున్నది. ఉద్యమాలకు ఊపిరి పోస్తున్నది. మరి ఏది శ్రేయస్కరం? ఏది సమాజ శ్రేయస్సును కోరుతున్నది? ఏది నైతిక బాధ్యత అన్న విషయం ఆలోచించవలసిన బాధ్యత రచయితల మీద, మేధావి వర్గంమీద వున్నది.

సామాజిక శాస్త్రరచయితలు, రాజకీయ శాస్త్రరచయితలు, ఆర్థిక శాస్త్రరచయితలు, న్యాయశాస్త్ర రచయితలు, సాహితీరచయితలు నైతిక బాధ్యత వహించాలి. సమదృష్టిలో సహేతుకమైన విశ్లేషణలతో మానవ శ్రేయస్సు కోరి రచనావ్యాసంగం జరపాలి.

కందుకూరి వీరేశలింగం సాంఘిక దురాచారాలను రూపుమాపడానికి ఎంతో కృషి చేసినాడు.

దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ అని ఎలుగెత్తి చాటిన వైతాళికుడు గురజాడ అప్పారావు, సాంఘిక దురాచారాలను ఎదురించిన సంఘ సంస్కర్త. ఆయన రాసిన కన్యాశుల్కం నాటకం అందరికీ విదితమే.

సమాజంలో వున్న దురాచారాలపై తిరగబడిన విప్లవ సంస్కర్త వేమన. గోరంత పద్యంలో కొండంత భావాన్ని ఇమిడ్చి శతకాన్ని రాసాడు.

తెలుగుభాషను శాస్త్రీయంగా తీర్చిదిద్ది నూతన ఒరవడిని చేకూర్చిన కవి నన్నయ్య. తెలుగు కవులందరికీ ఆయన అన్నయ్య. ఆదికవి శబ్దశాసనుడు అని బిరుదులు పొంది, రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో కవిగా రాజమర్యాద లందుకొని తెలుగుభాషను సుసంపన్నం చేసిన మహనీయుడు నన్నయ్య.

సామంతులను అదుపు చేసిన చక్రవర్తిగానే కాకుండా కళలను, సారస్వతాన్ని పోషించి కళాప్రియుడుగా పేరు పొందిన శ్రీకృష్ణదేవరాయలు, అష్టదిగ్గజాలకు నాట్యవిద్వాంసులకు ఆస్థానంలో స్థానం కల్పించాడు. ఆంధ్ర కవితాపితామహుడని తెలుగులోకం కీర్తించిన అల్లసాని పెద్దన్న. వికటకవి బిరుదుతో ప్రసిద్ధుడైన తెనాలి రామకృష్ణ కవులు నాడు నైతిక బాధ్యతలతో రాయల కొలువు దీరినారు.

సుమారు 32 వేలకుపైగా సంకీర్తనలు స్వయంగా తెలుగులో రాసి గానం చేసిన ప్రప్రథమ సంకీర్తనాచార్యులు అన్నమయ్య. రామదాసు రాసిన పాటలు, కీర్తనలు తెలుగు వాళ్ల హృదయంలో చిరస్థాయిగా వుండే ఆణిముత్యాలు.

మూఢ విశ్వాసాలతో ప్రతిదీ నమ్మకూడదంటూ ఆధునిక హేతువాదిగా తెలుగునాట స్వీకారం చుట్టిన కవి త్రిపురనేని రామస్వామి చౌదరి, వీరంతా నైతిక బాధ్యత వహించిన కవులలే. పుట్టుకతో దళితుడైనా కృషితో కవిశేఖరుడై నవయుగ చక్రవర్తి అయ్యాడు. జాషువా, ఆయన కవిత్వం సంస్కరణ భరితంగా సాగింది.

ఆధునిక సాహిత్యంలో అభ్యుదయ యుగానికి నాందీ ప్రస్తావన పలికాడు శ్రీశ్రీ. ఆయన రాసిన "మహాప్రస్థానం" సాహిత్య చరిత్రలో మలుపు సృష్టించింది. కర్కశ నిజాం ముష్కర పాలనపై విజృంభించి సాహిత్యోద్యమాలను, గ్రంథాలయోద్యమాలను నడిపి విప్లవ బావుటా నెగిరేసిన గొప్ప కవి అళ్వారుస్వామి. నా తెలంగాణ కోటి రత్నాల వీణ అంటూ తెలంగాణకు ఒక విద్యుత్తేజాన్ని అందించిన కవిభాస్కరుడు దాశరధి. తెలంగాణ ప్రజల తిరుగుబాటు కాలంలో ప్రతి యింట్లో ఆయన పాటలు, పద్యాలు మారుమోగాయి. పల్లెటూరి పిల్లగాడా...పసుల గాసే మొనగాడా పాట గుర్తుండి వుంటే సుద్దాల హన్మంతు గుర్తుండి వుంటాడు. తెలంగాణ ప్రజలు భూస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటు చేస్తున్న కాలంలో గొల్ల సుద్దులనే కళాప్రక్రియకు ప్రాణం పోశాడు.... ఈ సందర్భంగా తమ శక్తితో మనను ప్రభావితం చేసి మన జీవితాలను మలుపు తిప్పిన మహనీయులను తప్పక సంస్కరించుకోవాలి.

అహింసా, సత్యాగ్రహాలనే మహాయుధాల్ని మానవాళికందించిన మహనీయుడు మహాత్మాగాంధీ. న్యాయవాద వృత్తిని చేపట్టేందుకు దక్షిణాఫ్రికా వెళ్లిన ఆయన్ని అక్కడి జాతివివక్ష కలచివేసింది. అక్కడ విమోచన పోరాటం సాగించిన ఆయన స్వదేశానికి తిరిగి రాగానే మాతృభూమి స్వాతంత్ర్యోద్యమంలో మమేకం అయ్యాడు. భారత ప్రజల స్థితిగతులకు అద్దం పట్టే విధంగా ప్రవర్తించే వారితో మమేకమయ్యే వ్యక్తే నిజమైన నాయకుడని భావించి అదే పథంలో కొనసాగుతూ ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన బ్రిటీష్ సామ్రాజ్యాన్ని ధిక్కరించడం తుపాకులతో అయ్యే పని కాదని గ్రహించి తన వినూత్న సిద్ధాంతాన్ని ఆవిష్కరించారు. తుపాకులకన్నా, సైనిక బలం కన్నా అహింసా నైతిక ప్రవర్తనలలే ఎంతో శక్తివంతమైనవని చాటిచెప్పాడు. వాటిని ఉల్లంఘించాడు. సహాయ నిరాకరణతో వారిని బెంబేలెత్తించాడు. జాతీయతా భావాన్ని పరిపుష్టం చేశాడు. కులతత్వాన్ని త్యజించాడు. హిందూ-ముస్లిం ఐక్యత కోసం పాటుబడ్డాడు.

చీకటి నిండిన గర్భగుడిలో కాదు. ఎండలో నడిరోడ్డు మీద రాళ్లను కొట్టి శ్రమిస్తున్న మనిషిలో నాగలి పట్టి ఈ భూమిని సస్యశ్యామలం చేస్తున్న రైతులో దేవుడున్నాడని ప్రకటించిన రవీంద్రనాథ్ టాగోర్ కవిత్వానికి మానవుడే కేంద్రం. భారతీయ హృదయ సౌందర్యాన్ని పాశ్చాత్య దేశాలకు వినిపించిన విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్. తను రచించిన గీతాంజలి కావ్యానికి గాను 1913లో సాహిత్యంలో అత్యున్నత నోబుల్ బహుమతి అందుకున్నారు. ఈ అవార్డును పొందిన తొలి ఆసియావాసి ఠాగోర్. తత్త్వవేత్తగా, కవిగా, చిత్రకారుడిగా, నటుడుగా, రచయితగా, గీతకారుడుగా, సంగీతకారునిగా, జాతీయవాదిగా, విశ్వశాంతి ప్రచారకుడుగా ఠాగోర్ వ్యక్తిత్వం బహుముఖంగా వికసించింది. ప్రాక్పశ్చిమ చింతనలకు భారతదేశం కేంద్రంగా భాసిల్లాలని శాంతి నికేతన్‌లో "విశ్వభారతి" విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. ఠాగోర్ తన 70 ఏళ్ళ వయస్సులో 3వేల చిత్రాలను గీసారు. 1919లో జలియన్ వాలాబాగ్

దురంతానికి చలించి తనకు బ్రిటీష్ప్రభుత్వం ఇచ్చిన "సర్" బిరుదును వదులుకున్నాడు. ప్రతి దేశంలోను ప్రజలు అపూర్వ స్వాగతం పలికారు.

కవులకు బహిర్ ప్రపంచం పట్టదంటారు. వారి లోకమే వేరంటారు. కానీ సరోజనీనాయుడు ఈ రెంటి సమ్మిళిత వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న మహనీయురాలు. అటు కవయిత్రిగా భావామృతాన్ని పంచి సాహితీప్రియుల్ని అలరించిన ఆమె మాతృభూమి స్వేచ్ఛ కోసం అహర్నిశలు శ్రమించినారు. బెంగాలి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన సరోజనీ చటోపాధ్యాయ చిన్నతనంలోనే సాహితీసుగంధాన్ని ఆస్వాదించినారు. ఇంగ్లాండులో స్వేచ్ఛావాయువులు పీల్చిన సరోజనికి మాతృభూమిపై వలస పాలకుల ప్రాబల్యం భరించరానిదయింది. 1916లో ఆమె చేసిన ప్రసంగాన్ని విన్నవారిలో జవహర్లాల్ నెహ్రూ కూడా ఒకరంటే ఆశ్చర్యం కలిగిస్తుంది. స్వదేశంలోనూ, విదేశాలల్లో కూడా మాతృభూమి స్వేచ్ఛ కోసం సరోజని శ్రమించారు.

భారతీయ సాహిత్యానికి ఆధునిక సుగంధాన్ని అద్దిన రచయిత ప్రేంచంద్. చిన్న కథలతోనే భారతీయ జీవనగతిని అక్షరబద్ధం చేసిన ఆయన హిందీ సాహిత్యంలో నవలాప్రక్రియకు ఆద్యులు. జీవితమంటే ఏమిటో తెలియని వయస్సులోనే భారతీయ జీవనసారాన్ని ఆకలింపు చేసుకున్న ప్రేంచంద్ మనసు వలస పాలకుల దుర్నీతితో ప్రజ్వరిల్లింది. చిన్న కథలతోనే వలస పాలకులపై ఆయన సాహితీపోరాటాన్ని సాగించారు. 1907లో "మాతృభూమి" ఘోష పేరిట ముద్రితమైన ఆయన కథల సంపుటితో భీతిల్లిన ఆంగ్లపాలకులు దానిపై దేశద్రోహ ముద్ర వేశారు. అప్పటివరకు ధన్పత్రాయ్తో సాగిన ఆయన రచనలు "ప్రేంచంద్" అనే కలం పేరుతో పరవళ్లు తొక్కాయి. భారతీయ నాగరికత సాంస్కృతిక ఔన్నత్యాన్ని చాటి చెబుతూనే ఆనాటి వికారాలను నిలదీశారు. 'ముక్తిమార్గ్'తో ధనిక పేదల మధ్య సంఘర్షణ ఎంత అర్థరహితమైనదో తెలిపారు. అలాగే 'కఫన్' పేదరిక దుర్భరత్వాన్ని కళ్లకు కట్టినట్లు ఆవిష్కరించారు. మార్క్స్, మహాత్మాగాంధీ,

డికెన్స్, టాల్‌స్టాయ్‌ల ప్రభావం మనకు ప్రేంచంద్ సాహిత్యంలో కనిపిస్తుంది.

విద్య ఒక ధనం. బంగారం కంటే విలువైనది. అయితే అది కంటికి కనిపించదు. అంతరంగికం. దొంగలకు దొరకదు. అది మనం అనుభవించినా, ఒకరికిచ్చినా తరిగేది కాదు. కోరిన వాళ్లకిచ్చినకొద్దీ పెరుగుతుంది. ప్రళయం వచ్చినా నశించదు. కాబట్టి విద్వాంసుల ఎదుట ఎవరూ విర్రవీగకూడదు. పండితులకెవరూ సాటిరారు. రాజులైనా, చక్రవర్తులైనా దురాగ్రహం మాని పండితుల యెడల గౌరవబుద్ధితో ప్రవర్తించాలి అన్నాడు భర్తృహరి.

లోకప్రయోజనం కొరకు పాటుబడే మానవులు ఏ ప్రయోజనాన్ని ఆశించరు. స్వప్రయోజనం స్వార్థం వాళ్లకు ఆమడ దూరంలో వుంటాయి. ఏదో లాభాన్నో లేక ఏదో ఒక ప్రయోజనాన్నో ఆశించి స్నేహానికి తలపడరు. నిరంతరంగా, నిస్వార్థంగా నిర్దుష్టంగా స్నేహం కొనసాగాలన్నదే వాళ్ల తలంపు.

ఏదేని హితము కోరినా యోగ్యతా యోగ్యతల గురించి కూడా పట్టించుకోరు అలాంటి మానవులు. తమకు తోచిన రీతిలో తమ వంతు కర్తవ్యంగా భావించి తోటివారికి సహాయపడతారే గాని ఎదుటివాని యోగ్యతని బట్టి పాత్రతను బట్టి ఏ ఎండకాగొడుగు అన్న రీతిలో ప్రవర్తించరు లోకకళ్యాణ కారకులు.

"మనిషికి ఓరిమి వుంటే వేరే కవచం అక్కరలేదు. క్రోధం వుంటే వేరే శత్రువులక్కరలేదు. దాయాదులుంటే వేరే నిప్పక్కరలేదు. మంచి మిత్రులుంటే ఔషదాలక్కరలేదు. దుష్టులు, దుర్మార్గులూ చుట్టూ చేరితే త్రాచుపాము లక్కరలేదు. చదువుంటే డబ్బక్కరలేదు. మంచి పాండిత్యం గాని, కవిత్వం గాని వుంటే రాజ్యాధికారమే అక్కరలేదు" అన్నారు భర్తృహరి.

ఏ కాలంలోనైనా గణనీయమైన పాఠకసముదాయానికి ఆ కాలానికి సంబంధించిన సామాజిక సంస్కారాన్ని అందజేస్తూ, స్పందన కలిగిస్తూ వారిని విశేషంగా ప్రభావితం చేయగలిగినది గొప్పరచన అనిపించుకుంటుంది. సాహిత్య పరిణామాన్ని కొత్తమలుపు తిప్పే గుణం కూడా దానికుంటుంది.

గిరిజన మనస్తత్వం నుండి పట్టణ నగర మనస్తత్త్వాల వరకు ఆపైన అంతర్జాతీయ మనస్తత్త్వం వరకు కూడా వున్న మన సమాజంలో మనుషుల మధ్య సంబంధాలనూ, రాగద్వేషాలను గ్రహించి, స్పందింపజేసే లక్షణం కూడా గొప్ప రచనకు ఉంటుంది. చారిత్రక దృక్పధం కలిగినా, జానపద సాహిత్యమైనా, స్త్రీవాద సాహిత్యమైనా, దళితవాద సాహిత్యమైనా ఏ ప్రక్రియఅయినా మానవాళి మనుగడకు దోహదపడుతూ నైతిక విలువలను కాపాడే రచనలను చేస్తూ విద్యావంతులను సమాజాన్ని మంచిమార్గం లోకి తీసుకవెళ్లాల్సిన గురుతర బాధ్యత నేటి రచయితలపై, కవులపై, పండితులపై ఉన్నదని నేరప్రవృత్తి, భీభత్సం, అశ్లీలతలతో ఆకర్షించే రచనలను పాఠకలోకానికి అందించకుండా మనోవికాసానికి, సత్ప్రవర్తనకు, విజ్ఞానానికి ప్రాధాన్యత ఇచ్చే రచనలు సమాజానికి ఎంతైనా అవసరము.

శుభం